## కృతజ్ఞతలు - ధన్యవాదాలు


నా తొలి కథల్ని ప్రచురించిన 'భారతి' సంపాదకులు కీ॥ శే॥ శివలెంక శంభుప్రసాద్ గారికీ; 'మందాకిని' ప్రధాన సంపాదకులు శ్రీ దాట్ల నారాయణ మూర్తిరాజు గారికీ; ఈ గ్రంథప్రచురణకు ఆర్థిక సహాయాన్ని అందించిన తెలుగు విశ్వవిద్యాలయానికీ; కవరు ముద్రణలో సాయపడిన శ్రీ వాసిరెడ్డి నవీన్ గారికీ; గ్రంథముద్రణ సకాలంలో చేసిన 'కిషోర్-సుజాత' వారికీ; నా నమః పూర్వక కృతజ్ఞతలు.

ముఖపత్రచిత్రణా అక్షరాలూ; పుస్తకంలోని లైన్ డ్రాయింగులూ మోటిఫ్‌లూ వేసిన చి॥ నా కుమారునికీ, నా తండ్రిగారి రూపరేఖా చిత్రకారుడు చి॥ సురేశ్‌కృష్ణకూ నా ఆశీఃపూర్వక ధన్యవాదాలు.

—రచయిత.


## కథా సూచిక

పేజి నెం.



## ఇంటికి వెళ్ళిపోదాం

నీరెండలో డాబామెట్ల మీద కూర్చుని శ్రీనాథూ శేఖరూ లెక్కలు చేసుకొంటున్నారు, వాళ్ళకి కొంచెం దిగూ మెట్టుమీద వాణి కూర్చుని. కొండపల్లి బొమ్మల్తో సంసారం లక్కపిడతల్తో పేర్చుకొని ఆడుకొంటోంది.

పేపరు చదువుకొంటున్న వాడినల్లా "యేం! యెదవా - మళ్లీ పలకొత్తు తన్నేత్తానంతే" అన్న వాణి మాటలు విని మెట్లమీదికి దృష్టిమళ్ళించేసు. అప్పటికే వాణి శ్రీనాథ్ దగ్గరికి వెళ్ళడం, వాడిమీద వో చిన్న చరుపు చరుస్తూ "మలి నా బొమ్మలెందుకు పలగొత్తాలి" అని అనడం - అయిపోయి; తిరిగొచ్చి పడిపోయిన బొమ్మల్ని సర్దుకొంటోంది. నిల్చోబెట్టిన చెవులపిల్లీ, గొల్లభామా అటూ ఇటూ తల లాడిస్తుంటే శేఖర్ వాటివైపే అలా చూస్తున్నాడు. శ్రీనాథ్ మళ్లా సందుచూసి మెల్లిగా వోనోట్సు పుస్తకాన్ని బొమ్మల పైకి విసిరి, నంగనాచిలా రాసుకొంటున్నాడు. "యేంరా దొంగ యెద్దవా... వుండు నీపని అమ్మతో సెపతాను" అని వాణి అంటూనే లేచి పుస్తకాన్ని శ్రీనాథ్ పైకి గిరాటెట్టి; "అస్సలు నేనాలుకోనే ఆలుకోను! ఛీ!" అంటూ మిగతా బొమ్మల్ని కూడా కాలితో తోసేసింది. వాణి అన్న మొదటి వాక్యంతో బొమ్మల మీద నున్న శేఖర్ దృష్టిచెదిరి వాణిపై నిలిచింది! శూన్య దృక్కులతో తదేకంగా దాన్నే చూస్తున్నాడు. నీరెండలో వాడికళ్ళు చూడ్డాని కటోలా వున్నాయి!

ఇంతట్లోనే వాణి కళ్ళని మిలమిలా ఆడిస్తూ "సెప్పన్లే" అని హుందాగా అని; "మలేం - నాకా నెమలికన్ను యిచ్చెయ్యరా!" అంటూ తాను గిరాటెట్టిన నోట్సులోంచి జారిన నెమలికన్నును అందుకోబోయింది. కాని; శ్రీనాథ్ ముందే అందుకొని మేడమీదికి దౌడుతీసేడు. "వ్వాలే అన్నయ్యా నాకిచ్చేయ్యాలా అది! "అంటూ వాణి వాడి వెనక పరిగెడుతోంది. దాన్ని పరిగెత్తించి పరిగెత్తించి; వొక్కసారి తను ఠక్కున ఆగిపోయి; నెమలికన్ను వున్న చేతినిపైకెత్తి "అందుకో ఇచ్చేస్తాను" అన్నాడు శ్రీనాథ్. మెల్లిగా వాడి వెనక నుంచి దేకుతూ వెళ్ళిన శేఖర్ చటుక్కునలేచి వొకచేత్తో శ్రీనాథ్‌ని కదలకుండా చుట్టేసి; రెండో చేత్తో నెమలి కన్నువున్న చేతిని బలవంతంగా

దిగూకి వాణి కందేలాదించి "ఎందుకురా నా చిట్టిచెల్లిని ఏడిపిస్తావ్?- వాణీ అంటే మా చిన్నారి బంగారుతల్లి-ఏమ్మా కదూ!" అంటూ వాణి నెత్తుకున్నాడు.

ఇంతలో ఇంట్లోంచి "రిక్షా వొచ్చే వేళైంది - కుఱ్ఱాళ్ళని అన్నాలికి రమ్మనండి" అన్న నా భార్య మాటని వాళ్ళ కందించి; మళ్ళా నేను పేపర్లో పడ్డాను.

మేడ దిగి ఇంట్లోకి వొస్తూనే శ్రీనాధ్ "నాన్నా! ఇవాళ కూడా శేఖర్ స్కూలికి రాట్ట!" అన్నాడు. "శేఖరేవిఁటి అన్నయ్య అనలేవూ? ఎన్నిసార్లు చెప్పేనలా పేరుపెట్టి పిలవద్దని!- నువ్వెళ్ళి భోంచేస్తూండు వాడూ వొస్తాడు" అన్నాను. వాణిని మెట్లు దించి, బొమ్మల్ని ధానిముందరఁ పేరుస్తున్న శేఖర్ని పిలిచి "జ్వరం తగ్గిపోయింది కదా వెళ్ళడానికేంరా!" అన్నాను చేతిని పట్టుకొని పరీక్షిస్తూ.

"ఉట్టినే - రేపట్నించీ వెళతాను" అన్నాడు క్రిందికి చూస్తూ.

"ఉట్టినే ఎందుకు చెప్పు స్కూలు మానేయడం? వొంట్లో బాగులేకపోతే యెలాగూ తప్పదు. ఇప్పటికే వారం పైగా వెళ్ళలేదు - ఏసబ్జక్టులోనన్నా వెనక బడితే దాన్ని కవర్ చేసుకోవడం యెంత కష్టమని!- వెళ్ళిరా నా మాట విని. నేను మీ క్లాస్ టీచర్కి లెటర్ రాసిస్తానుగా ఇన్నాళ్ళూ వొంట్లో బాగోలేదని. ఏం! అది కాదు - చూడిలా! ఎందుకు వెళ్ళవో నాకు చెప్పడానికేం?" అన్నాను తటపటాయిస్తున్న శేఖర్తో.

"ఇవాళ నాన్న దగ్గిర్నుంచి వుత్తరం వొస్తుందని"-నా నుంచి చూపు మళ్లించుకొంటూ అన్నాడు. కళ్ళలో కొంచెంగా నీళ్ళు సుళ్ళు తిరుగుతున్నాయి.

వంటింట్లోంచి "నెల క్రితం నుంచీ రాని వుత్తరం ఇవాళొస్తుందిట్రా నీ పిచ్చిగాని!" అంది నా భార్య.

"బాగుంది! ఇన్నాళ్ళూ రాలేదు గాబట్టి ఇవాళకూడా రాదని ఏం చెప్పగలం కాని! నాకూ్కడా వడ్డించు. వీడి మాష్టారికి రెండు ముక్కలు రాసి వొచ్చేస్తున్నా" అని; శేఖర్తో "వుత్తరం కోసం స్కూలుమాని కూర్చోడ



మెందుకురా. ఉత్తరం వొస్తే అలాగే వుంచుతాను. సాయంత్రం నువ్వే చదివి వినిపిద్దుగాని - ఏం - వేగిరం భోంచేయి మరి రిక్షా వొచ్చేస్తుంది"అని, వాడిని లోపలికి పంపించి; ప్లేంక్ తీసుకొని లెటర్ వ్రాస్తున్నాను.

వాణి బొమ్మలన్నింటినీ మెల్లిగా ఇంట్లోపెట్టి "నాన్నా మలేం యీ నెమిలీక ఈ బొమ్మ తలకి కత్తు నాన్నా - ఇంచక్కా యెంతో బావుంతాది" అంటూ వో చిన్నదారం ముక్కా నెమలి కన్నూ, గొల్లభామ బొమ్మా ప్లేంక్ మీద పెట్టింది.

"అదెలా కట్టనమ్మా? దీని తల నున్నగా బోడిగుండులాగా వుంది. దారం కడితే మొహం మీదికి వొస్తుంది. అసలు బిగవదు. జారిపోతుంది. అలాగే ఆడుకొందూ - రాత్రి ఈకల అల్పంతో గుచ్చుకొందాంలే."

"నేపెడతానురావే" అంటూ అన్నం తింటున్న శేఖర్ పిలిచేడు. కాగితాన్ని రాసి పుస్తకాల బాక్సుమీద పెట్టి భోజనానికి వెలుతుంటే వాణి మహదా నందంతో ఎదురుగావొచ్చి "నీకేం తెలీదు నాన్నా, పెద్దన్నయ్య చూడు ఎంచక్కా ఎంత బాగా అంతించేడా!" అంది బొమ్మని చూపిస్తూ. గొల్లభామ నెత్తికి వెనకగా కొంచెం ప్రక్కన నెమలికన్ను పెట్టి దానిపై నుంచి బొమ్మకి ట్రాన్సుపరెంట్గా వున్న వో చిన్న స్టికర్ ముక్కని బిగుతుగా అంటించేడు. బొమ్మ తల వరికిస్తుంటే నెమలి కన్నుకూడా తలతో కలిపి వూగుతూ గొప్ప అందంగా వుంది. "వీడికి ఎంత వేగిరం ఐడియా తట్టింది" అనుకొంటూ "ఈ స్టిక్కర్ ముక్క ఇప్పటికిప్పుడెలా వచ్చిందిరా" అన్నాను పీటపై కూర్చొంటూ.

"ఆమధ్య మీరు పళ్ళపొడి సీసా కొన్నారు కదా. దాని అట్టపెట్టికి సీల్చేసి వుంటే ఉట్టినేతీసి గుమ్మానికి అంటించివుంచేను" అన్నాడు లేచి చేతులు కడుక్కుంటూ.

వీధి గుమ్మంలోంచి "అబ్బాయిగారూ" అన్న రిక్షావాడి కేక విని బైలు భుజాన వేసుకోని, బూట్లు వో చేత్తోను, పుస్తకాల బాక్సు మరో చేత్తోనూ పట్టుకుని గుమ్మం దగ్గిరకి కుఱ్ఱాళ్ళు పరిగెత్తేరు. నా భార్యా, వాణీ టిఫిన్ కారియర్లని పట్టుకు వీధి గుమ్మంలోకి వెళ్ళేరు.

"మలేం అన్నయ్యా ఎప్పలూ నన్నేలిపిస్తాడే అమ్మా. మరి నేను వాలికి తాతా సెప్పను!

"చెప్పాపోతే మానీ - సాయంత్రం సర్కస్‌కి నిన్ను తీసుకువెళ్ళనంతే" అన్నాడు టై బిగించుకొని బూట్లు కట్టుకుంటూ.

"అమ్మా సలకసుకి నేనూలావద్దే" అంది జాలి కళ్ళతో బుంగమూతితో.

"వుత్తినేనమ్మా నువ్వు రాకపోతే ఏనుగులూ, కుందేళ్ళూ వాడిని గేటు దగ్గిరే అడ్డేసి లోపలికి వెళ్ళనీయవంతే" అంది రిక్షాలో కెక్కిన కుర్రాళ్ళకి బాక్సుల్ని అందిస్తూ.

"పెద్దన్నయ్యా తాతా........ అన్నయ్యా తాతా."

అన్నం తింటున్న వాణిల్లా ఠక్కున వెనక్కి తిరిగి శేఖర్‌వైపు చూసేను! చేతినూపే వాడి కళ్ళలో మెఱుస్తున్న సంతృప్తి నా కళ్ళబడి వొక్క సారిగ చలించిపోయేను. సాయంత్రపు నీరెండపోయి, వెన్నెల రాడానికి ముందర - నీలాకాశంలో నూత్న కాంతితో మెరిసే నక్షత్రాల్లాగా వున్నాయి వాడి కళ్ళు!

"డాక్టరు గారేమన్నారండీ?" అంది మజ్జిగపోస్తూ నా భార్య.

"ఏమంటారు. అసలు వాడికి డిసీజంటూ వుంటే కదా!...... వాడికి తల్లిదండ్రుల మీదా తోబుట్టువులమీదా వుంది మనసంతా!......ఈ సంగతు లేవీ మా అన్నయ్యలుంగారికి అర్థంకావు అయితే పరిస్థితులు కూడా అలాగే వొచ్చేయనుకో." అన్నాను లేస్తూ.

"పరిస్థితులేవిటండీ....కుర్రాళ్ళు దగ్గిరున్న కొద్దిపాటి రోజుల్లో కూడా వాళ్ళిద్దరికీ తమ తమ ఆనందాలు తప్ప వీళ్ళగొడవ అస్సలు పట్టదు గదా! ఇంట్లో పిల్లల్ని వుంచి తలుపులికి తాళాలేసుకొని ఎంచక్కా ఎవరి మట్టుకు వారు సినీమాలకనీ షికార్లకనీ పుడాయిస్తారు. రాత్రి యెనిమిదవ కుండానే పిల్లల్ని ఎలాగోలాగ పడుకోబెట్టేసి ఇంట్లోనే తాగి తందనాలాడతారు అంది కిళ్ళీ చుట్టి అందిస్తూ.



"అవన్నీ అలా వుండనీ, కనీసం వారానికో పక్షానికో వో కార్డు ముక్కన్నా వాడిపేర రాని పడేయడానికి వాడికి వీలు చిక్కడం లేదా అని?! నేను ఎప్పటినుంచో శేఖర్ని తెగస్టడీచేసి చూస్తున్నాను. మన పిల్లలపై మనం మనకే తెలీకుండాచూపే వాత్సల్యాభిమానాలు వాడికి కావాలి శ్రీనాధ్‌కి వాణికీ మధ్యనున్న చనువూ, సోదరప్రేమా వాడికి కావాలి....ఎంత హోల్‌హార్టెడ్‌గా మనం వాడిని చూస్తున్నా...ఏదో ఎక్కడో ఆ లేతమనసు వెలితిని ఫీలై షాక్ తింటున్నాడు మెంటల్‌గా! సరిగ్గా ఆర్నెల్లనుంచి వాడీ మానసిక క్షోభానికి అడపా తడపా గురై; గతవారమంతా ఆబాధే తారస్థాయికి పోగా మంచం పట్టేడు!.... ప్చ్ వాడినెలా సముదాయించాలో నాకర్థం కావడం లేదు."అన్నాను చెప్పుల్లో కాలుపెట్టి తల దువ్వుకొంటూ.

సైకిలు దింపుతుండగా పోస్టుమేన వచ్చి ఓ కవరందించేడు. కలకత్తా నుంచే వొచ్చింది నాపేరనే! చింపబోతూ శేఖర్ కిచ్చిన మాట గుర్తుకొచ్చి "వాడొచ్చిన వెంటనే ఇయ్యి నే స్కూలుకి వెళ్తున్నా" అని నా భార్యకి కవరందించి పెడల్ వేసేను వాణి చేతి టాటా నందుకొని.

సాయంత్రం నేవచ్చేసరికి కుర్రాళ్ళిద్దరూ మరికొందరితో కలిసి మండువాలో దాగుడు మూచ్చులాడుకొంటున్నారు. వాణి ఈమధ్యే సరదాగా కుట్టించిన కొత్త జరీఅంచు పరికిణీ జాకెట్టూ కట్టుకొని; పొట్టి పిలకకి నాలుగు చేమంతి పూలు కుట్టించుకొని జడగంటలు వేసుకొంది వాటి బరువుకే జడ సాగినట్లుంది. ఆటలో తల్లిగా వాణినే పెట్టుకొన్నారుగాని; దొంగల్తోబాటు తనూ ఈవారా ఆవారా నక్కుతూ, అటూ ఇటూ పరిగెడుతూండడలవల్ల తల్లిని దొంగలు ముట్టుకోవడంకాక తల్లే దొంగల్ని ముట్టుకోవడంతో కుర్రాళ్ళు మరింత గోల చేస్తున్నారు.

"కాఫీ తెస్తావా- అన్నయ్య ఏవిటి రాసేడు" ఇంట్లోకివెళ్తూ వంటింట్లో వున్న నా భార్యతో అన్నాను.

"ఏమో పాపం వాడు సరదా పడ్డాడేగాని; అది ఇంగ్లీషులో వుండడంవల్ల దిగాలు పడిపోయి దాచేసి ఆడుకొంటున్నాడు. మీరు కాళ్ళుకడుక్కోండి ముందు" అంది. "ఏమిటి విశేషం? ఏదో సువాసనవేస్తోంది" అని నేననే

లోపలే కుర్రాళ్ళింట్లోకి రావడం, నన్ను చుట్టుముట్టడం అయింది శ్రీనాథ్ "నాన్నా ఇవాళ నేను అన్నయ్యా, అన్నయ్య తమ్ముడూ, చెల్లి అక్కా అయిపోయాం! ఏఁవిటో చెప్పుకో చూద్దాం"అన్నాడు.

ఇంతట్లోకే జానోస్తూ వొచ్చిన వాణి "నాన్నా నాన్నా మరేం మరి అమ్మ - కాదు నాన్నా పెద్దన్నయ్య ఇప్పుడే పుత్తేసేడు నాన్నా! మరి అమ్మ నేనూ ఆ వెల్లి కొత్త మించి సామానులూ, బత్తలూ తేచ్చేంమాట. మరి నాకు కాళ్ళు పీకెలతాయి కదా అందుకని రిక్షా ఎక్కి వెళ్ళేం. నాన్నా - పెద్దన్నయ్యా బల్లో అమ్మగాలు నన్ను ఎత్తుకొని వుంచేత్తామన్నాలు. నాకు బిల్లలు ఇచ్చేరు. నేనన్ని మర్చిపోయే నాన్నా మరిఇలారా చెవులో సెప్పాలి అమ్మ నాకిట్టం అని ఎన్నో అప్పచ్చులు చేత్తున్నాదిమాత" అని చెవినుంచి వొళ్ళోకి జారింది.

"ఉఁ... ఇరొక్కత్తే వాగుడు కాయలాగ. ఎంతో సీక్రెట్ గా వుంచుదా మని అంతా అనుకొంటే" అన్నాడు శ్రీనాథ్ ఉరుముతూ.

"అరి దొంగల్లారా అదా సంగతి మరి పొద్దున్న చెప్పేవుకాదేమే" అన్నాను శేఖర్ వైపు చూస్తూ. వాడు తలంటుకొని పసుపు పెట్టిన కొత్త బట్టలతో పిన్ని అందించే ప్లేట్లు మాకందిస్తున్నాడు.

"నాకేవీఁటో జ్ఞాపకమేలేదు. మధ్యాహ్నం పడుకొన్నానంతే ఇదుగో మీ అమ్మగారు ఎందుకన్నాదో "అమ్మా నా పుట్టినరోజు కేం చేస్తావే"అని. అంతే తక్కున జ్ఞాపకం వొచ్చింది 'ఇవాళ శేఖర్ పుట్టినరోజు కదా! అని! అబ్బబ్బ ఆ మూనెకో దణ్ణం ఊరికే పొంగిపోతూ తెగ ఏడ్పించిందనుకోండి' అంది నెంగుతో తుడుచుకొంటూ.

"బాగుంది నాకన్నా మీ పిన్నే నయంరా!-హేపీ బర్త్ డే టూ యూ" అన్నాను ప్లేటు నందుకొని శేఖర్ భుజం చరుస్తూ.

"నువ్వు కూడా తినేయి పిన్నీ, తరువాత వంటిల్లు సర్దుకొని స్నానం చేద్దువుగాని" అంటూ తానే స్వీట్స్ సర్దిన ప్లేట్ ని నాభార్యకందిస్తూ శేఖరన్నాడు.

"మర్చిపోయేను- మరి మీరెందుకు ఈ కొత్తబత్తలూ జలగంతులూ చింగారించేవేరు సార్!" అన్నాను వాణి నోట్లో స్వీట్ నొక్కుతూ.



"నువ్వంత్రా యెప్పుడూ మర్చిపోవడమేఁ నాన్నా - మరి నేనుకూడా రేపో ఎప్పుడో పుత్తేసేను కదేంటి నాన్నా మరేం - నువ్వు మల్లా మరిచి పోయేవు. నేను సెప్పేయ్యనా! మరేం పెద్దనాన్నగారి పుత్తరం చూచేవా-"

"ఔనే నిజంగా నేనూ మర్చిపోయేను" అంటూ శేఖర్ వెళ్ళి ఉత్తరం తెచ్చేడు.

"ఏరా రాస్కెల్. వాడికి తెలీపోతే తెలీపోయిందిగాని నువ్వన్నా చదవ లేకట్రా. రాస్కెల్స్ మళ్ళా కాన్వెంట్ లో వెలిగిస్తున్నారు." అన్నాను ప్లేట్లో స్వీట్ ని విరిచి వో ముక్క శ్రీనాథ్ నోట్లో కుక్కుతూ; కవరందుకొని మిగతా ముక్క శేఖర్ నోట్లో కుక్కుతూ.

"అదేవిఁటి వాడు పెద్ద క్లాసా నేను పెద్ద క్లాసా? అయినా మాకు స్కూల్లో నేర్పేదీ మా కలవాటైనదీ ఇటాలిక్ స్క్రిప్ట్ సార్! నువ్వంటావు కదా "సిరాబుడ్డిలోంచి వొచ్చిన చీమ తెల్లకాగితం మీద పాకినట్టు" అని అలాంటి ఆ కలిపిరాతని హౌకేన్ వుయ్ రీడ్ సార్! అసలా లెటర్ లో వొక్క లెటర్ కూడా మాకు తెలీలేదు" అన్నాడు శ్రీనాథ్.

నవ్వుకొంటూ కవరులోంచి పుత్తరం తీసేను. ఓ పావువంతు మేర రాసివున్న లెటర్ హెడ్ కి పైన పిన్ చేసి నాలుగు వందలకి వో క్రాస్డ్ చెక్కు వుంది. "వీడికి పిచ్చెక్కు తున్నట్టుంది. మొన్న రెణ్ణెళ్ళ క్రితమేనా ఆరొందలు పంపిస్తే! ఏవిఁటి ఈ పదేళ్ళ కుర్రాడి రీసెర్చి స్టడీస్ కి సాలుకి ఏ మూడువేలో ఖర్చు చేయమంటాడుగాబోలు" అంటూ లెటర్ చదివి;

"నేనూ నీవదినా ఇక్కడ క్షేమం. నీకూ శేఖర్ కీ పిల్లలకీ మరదలికీ ఆశీస్సులు. ఈడబ్బు శేఖర్ చదువు ఖర్చులకోసం పంపిస్తున్నాను. క్రితం నెల ఏం పంపనందుకు మరోలా ఏం అనుకోకు. రాబోయే సంక్రాంతికి నీ దగ్గరికీ, తాడి కొండలో నా బావమరిది దగ్గరికి, మా మావఁగారింటికీ అంటే నెల్లూరూ వచ్చి మిమ్మల్ని, శేఖర్, రాజీ, విజ్జీలనీ చూచిరావాలనుకొన్నాను కానీ, అనుకో కుండా నాఫ్రెండ్స్ జనవరి తొలిరెండు వారాల్లోనూ డార్జిలింగ్, గాంగ్టక్ వగైరాలకి టూర్ వేసేరు. కాబట్టి రాలేకపోతున్నాం. చి॥ సౌ॥ మరదలికి మీ వదిన అడిగినట్లు వ్రాయమంది. వెంటనే ఉత్తరం కోరుతున్నాను. నీ అన్న" అని తర్జుమాచేసి చెప్పేను.

"అదేనిటి పుట్టినోజు అని ఇవాళే అందేలా ఆ చెక్కూ వుత్తరం రాసేశనుకొన్నాం" అంది నా భార్య.

శేఖర్ చూడకుండా నా భార్యని ఎర్రగాచూసి కన్నుగీటుతూ "బాగుందే! నీకే మధ్యాహ్నందాకా జ్ఞాపకం రాలేదు! రాద్దామనుకొనే మర్చిపోయేదుకాబోలు అయినా సరిగ్గా సమయానికి వొచ్చిందిగా కానుక. ఇన్కంటాక్స్ ఆఫీసరుగారి ద్వితీయ పుత్రరత్నానికి తండ్రి ఇచ్చే ఫాయాలోనే వుండిలే కానుక" అని కవర్ని శేఖర్ జేబులో పెట్టా "అయితే ఇవాళ ఏవిట్రాప్రోగ్రాం డిసైడ్ చేసేరు" అన్నాను మాటమారుస్తూ.

"సర్కస్" అన్నారు శ్రీనాధూ వాణీ గొంతులు కలిపి.

"మీరేవిఁటి చెప్పడం! వాడు చెప్పాలి" అంది నా భార్య.

"ఇవాళ సర్కస్ వద్దు."

"ఏంరా హాయిగా సర్కస్‌కి పోదాంరా" అని మళ్ళా శ్రీనాధూ వాణీ అంటూండగానే నేనూ గొంతు కలిపేను.

శేఖర్ కొంచెంసేపు ఏం అనకుండా వుండి; తల దించుకొని ఎటో చూస్తూ అన్నాడు- 'ఇవాళంతా పిన్ని పనిచేస్తూనేవుంది అసలు పడుకోలేదు- తలనొప్పి వచ్చి రాననంటుందని."

దాని సంగతేమో కాని నేనుమాత్రం వాడి మాటకి వొక్కసారి చలించి పోయేను. నిలుచున్నపళంగా శేఖర్ని పొదివి పట్టుకొని అక్కున చేర్చుకోవాలని పించింది. కాని; వాడి తల నిమురుతూ "ఆరినీ-అదా! ఫరవాలేదు సర్కస్‌కే పోదాం. ఏమే నువ్వేమంటావ్?"

"ఇవాళ వొద్దులెద్దురూ" అన్నాడు శేఖర్.

"మరేం చేద్దాం" అన్నాను.

"ఇవాళ పౌర్ణమి కదా హాయిగా మేడమేద కూర్చుందాం అందరం. మీరుమాత్రం కధలు చెప్పాలి" ఇలా అని ఏదో చిన్నతనం ఫీలైనట్లు అటు చూసూ వాణి నెత్తేసుకొని మండువాలోకి పారిపోయేడు.

నామట్టుకు నాకు గుండెల్లోంచీ ఏదో అనిర్వచనీయభావం ఉబికివొస్తోంది. శేఖర్‌ని అలా చూస్తూ; తమాయించుకొని లేచేను.



రాత్రి 'చిక్కుడుగింజా చాక్లెట్లలోకం' కథ అయి 'సిందుబాద్' కథ మొదలెట్టేసరికే వాణి తల్లి తొడనోదాన్ని ఆక్రమించుకొని నిదురబోతోంది. 'సిందుబాద్' కథ అయి 'కాంచనద్వీపం' మొదలుపెట్టిన కొంచెంసేపటికే శ్రీనాథ్ తల్లి రెండో తొడపై తల ఆన్చి పడుకొన్నాడు. జిమ్, డాక్టర్లబృందం అస్థిపంజరం గుర్తును వెతికేలోగానే నా భార్య అలాగే వాళ్ళో పడుకొన్న పిల్లలతో తాను వెనకనున్న పిట్టగోడకి జారపడి పడుకొంది. కథ సాగుతోంది.

సిగరెట్ వెలిగించేను. ఆకాశమాత వుంచిన మేఘాల పొత్తిళ్ళలో చంద్రుడు మాటిమాటికీ దాక్కుంటూ దోబూచులాడుతున్నాడు! తల్లి ప్రేమలా లోకాన్నంతనీ వెన్నెల ఆవరించి వుంది!

కథ చెప్తూ చెప్తూ అనుమానం వచ్చి శేఖర్ని చూసేను. వాడి దృష్టి కథమీదనుంచి చెదరి నా భార్యపైనా; ఆమె వొడిలో వెన్నెట్లో ఆదమఱచి నిదురించే శ్రీనాథ్, వాణీలమీదా పడింది. మళ్ళా సాయంత్రంలాగే నా గుండె ల్లోంచీ ఏదో భావం ఉబికివొస్తోంది. తమాయించుకొని తక్కున కథని ఆపేసేను. శేఖర్ వొక్కసారి నావైపు చూసి మళ్ళా శూన్యంలోకి చూస్తున్నాడు. వాడి కళ్ళలో వెన్నెల చోటుచేసుకొంది?! ఏం నాన్నా పడుకొంటావా? కథమానేసేదా!' అన్నాను. ఊఁ కొట్టేడు. "ఇలాదా! రేపు కలకత్తా వెళ్ళొద్దామా!" అన్నాను. "మీ యిష్టం."

ఫిష్ ప్లేట్లదగ్గరి కంకరరాళ్ళుకూడా లేచి ముందు వొస్తున్నాయా అని అనిపించేటంత వేగంగా కోరమండల్ ఎక్స్‌ప్రెస్ పరుగెడుతోంది.

చిలక సరస్సు దాటేసరికి శేఖర్ పడుకొన్నాడు. సిగరెట్‌మీద సిగరెట్ వెలిగిస్తూ వాడి ముఖంలోకే చూస్తూ కూర్చున్నాను. బుర్రంతా ఆలోచనల గాలులతో గింగురెత్తుతోంది! శరీరమంతా ఏదో భావోద్వేగం తారస్థాయిలో ప్రవహిస్తున్నట్లుంది! రైలు భువనేశ్వర్‌దాటి మరింత వేగాన్ని పుంజుకొంది.... రెండేళ్ళబట్టి నాదగ్గరే వుంటున్న వీడు నాలో రేకెత్తించని భావతీవ్రతని సరిగ్గా ఈ ఆర్నెల్లబట్టీ ఎలా నాలో రేపుతున్నాడు?- ఈ ఆర్నెల్లబట్టీ వీడి ప్రతీమాటా చేతా అతి నిశితంగా పరిశీలిస్తున్నానుగాబట్టా?! మొన్నొక వారంరోజుల జ్వరం నుంచీ తేరుకొన్నాక నిజంగా ఏదో ప్రశాంతతా, కాంతీ, సంతృప్తీ వీడి

మొగంలో కొట్టొచ్చినట్లు కన్పిస్తున్నాయి అంతకుముందు ఎప్పుడూ పరధ్యానంగా, ముభావంగావుండే వీడి కళ్ళలో ఈ నాలుగురోజుల్నించీ వింత వింత వెన్నెలకాంతులు కన్పిస్తున్నాయి?! ఇంత లేతవయస్సులో ఇంతగా లైఫ్‌తో రాజీపడ్డం సాధ్యమయే పనేనా అని?! రైలు పోతోంది.

కలకత్తా ఉదయం ఏడుకి చేరేం. ఎస్ల్పనేడ్‌కి ప్రక్కగా రబీంద్రసరణిలో వున్న వో పన్నెండంతస్థుల భవంతిలో పదకొండో అంతస్థు మా అన్నయ్య నివాసం. కలకత్తా రావడం నాకు మూడోసారీ, శేఖర్‌కి రెండోసారీ కాడంతో సులువుగా ఓ ముప్పావుగంటలోనే ఇల్లు చేరేం. తలవని తలంపుగా మేం కంటబడేసరికి అన్నయ్యా వదినా కాస్తంత ఆశ్చర్యపడ్డారు!

కాలకృత్యాలూ, బ్రేక్‌ఫాస్టూ అయేక శేఖర్ రేడియోగ్రాం వున్న రూమ్‌లో రికార్డుల ఆల్బం ముందేసుకుని ఏవేవో రికార్డులు తీసి ఆన్‌చేస్తూ ఆపుతూ ఎంచుకొంటున్నాడు.

నేను బెడ్‌రూంలో పూరకే దొర్లుతున్నాను. ఏవో పత్రికలు తిరగేస్తూ ఉన్నట్టుండి దండెంమీద నా దృష్టిపడింది. అస్తవ్యస్తంగా దండెంమీంచి వ్రేలాడుతున్న తెల్లచీరకి దిగువన దండెంమీంచి ఏదో వ్రేలాడుతుంటే లేచి చీర జరిపి చూసేను కుట్టిన పూలజడ?! వాడిన పూలతో అదో వెగటువాసన వేస్తోంది. ఇందాకా డైనింగ్‌హాల్లో టేబుల్ దిగువన బేసిన్‌లో కుప్పగావున్న గాజుగ్లాసులకీ, మగ్గులకీ, ప్లేట్లకీ, దీనికీ ఏమిటో సంబంధం! అనుకొంటూ ఫ్రిజ్ తెరిచేను. మధ్యఅరలో మూడు బీరుబాటిల్సూ, రెండు విస్కీ, ఒక జిన్నూ ఉన్నాయి. దిగూ అరలో పళ్ళూ, ఏవేవో డ్రింక్ సీసాలూ వున్నాయి. పై అరలో ఆర్టిస్టిక్‌గావున్న ఓగాజు జాడీమీద నా దృష్టి పడింది. ఎర్రని నీళ్ళలో ఊరేసిన ఉసిరికాయల్లా తేలుతూ ఏవో పళ్ళున్నాయి! అతి పదిలంగా జాడీ తీసి పట్టుకొని మూతతీసి వాసనచూసేను. అదో ప్లెజెంట్ స్మెల్! ఏదో వైన్ వాసనే! కాని ఈ పళ్ళేవిటి?.

టర్కీ టవల్తో తుడుచుకొంటూ రూంలోకి అన్నయ్య వచ్చాడు. "ఏవిట్రా-ఇవి!" అన్నాను స్పూన్‌తో వో రెండు నోట్లోవేసుకొంటూ. "అవా! ఏం ఎలావుంది టేస్ట్! అలా కాదనుకో తినడం. వాటిసంగతి రాత్రి చెప్తాలే.



అంతదాకా నువ్వు పళ్ళని తినేకుండా మిగిలిస్తే నేననుకో. నిన్న మీ వదిన మేరేజ్‌డే అంటూ తెగ హంగామా చేసిందిలే. చిన్నపార్టీఇచ్చేం మా ఫ్రెండ్స్‌కి ఇంట్లోనే రాత్రి. మీరు ఏ అర్థరాత్రో రాకపోడం మీ-మా అదృష్టమే! ఏవిటో లైఫ్‌ని ఎంత ఎంజాయ్ చేస్తున్నా తనివి తీరదు నాలాంటివాళ్ళకి! ఇవాళ తప్పనిసరిగా ఆఫీసుకెళ్ళాలి. నిన్న ఫ్రెంచిలీవు కూడాను. కారు పంపిస్తాను ఎక్కడికన్నా వెళ్ళండి మీ ముగ్గురూ" అన్నాడు డ్రెస్ పూర్తై దువ్వుకొంటూ.

"శేఖర్ ఎక్కడికీ రానన్నాడు. రాత్రి నిద్రలేక నాకూ టీడియస్‌గా వుంది. నువ్వు వొచ్చేవరకూ పక్కేస్తాను" అన్నాను ఆవలిస్తూ. పళ్లు ఏదో వింతరుచితో స్లైట్ ఆల్కహాలిక్ ఘాటుతో నిండారా ఏదో రసాన్ని చిప్పిలుతూ నోట్లోంచి లోపలికి జారుకున్నాయి.

"సరే నీ యిష్టం. ఎంత ప్రయత్నించినా రాత్రి ఏడు దాటుతుంది నే వచ్చేసరికి. అయినా ముందుగా రాడానికి చూస్తాను. మరినేను భోజనం చేసిపోతాను" అని వెళ్ళేడు

మధ్యాహ్నం నాకు తెలివి వొచ్చేసరికి వొంటిగంటయింది. ప్రక్కరూంలోంచి "సాహు సాహూరే" అని ఏదో చక్కని బెంగాలీపాట విన్పిస్తోంది. గొప్పగా మనసును ఊపేస్తోంది ఒక్కముక్క అర్థంకాకపోయినా! ఏదో జానపద గీతంలాగే వుంది. పాట అయేక మళ్ళా అదేపాటవేసేడు! ఎవరో ప్రేయసి ఎందుకో ప్రియుణ్ణి నిందిస్తోందిగాబోలు 'సాహూ' అంటే సాధువుకదా! మరి సన్యాసికి ప్రేయసి తిట్లేవిటి?! ఏమైనా భాష అర్థం కాకపోయినా ఆ పాటలో భావం మాత్రం అదే తప్పకుండా.

"మున్నీ! ఎక్కడనుంచి లాగేవురా ఆ వెధవ పాటని అన్నీ అప్టుడేట్ రికార్డులుండగ! అంకుల్ లేచేరేమో చూడు మీల్స్ చేద్దాం" అవతలిరూంలోంచి వదినగారు శేఖర్ని కేకేసేరు

నేను లేచి శేఖర్ రూంలోకి వెళ్ళి "ఎవర్రా పాడుతుంటా?" అన్నాను.

"రూనా లైలా! బాగుంది కదండీ పాట; బెంగాలీ ఫోక్‌సాంగుట. ఈ పాటై పోసింది ఇదే రికార్డు వెనకాతల హేమంత్ కుమార్, చక్రాబార్టీలు పాడిన మరో రెండు పాటలు గూడా చాలా బాగున్నాయి".

"చక్రబర్తి కాబోలురా. ఇంగ్లీషులో అలాగే రాయాలికదా. బెంగాలీలో "వ"కి "బ" పలుకుతారులే. నువ్వింకా భోంచేయలేదూ. లేమరి."

మీరు పడుకొన్నాక అమ్మ ఫ్రెండ్స్ వస్తే వాళ్ళతో మాట్లాడుతూ కూర్చొంది ఏం తోచక నేనలా ఓసారి బజారులోకి వెళ్ళొచ్చేను" అంటూ లేచి తన బేగ్ తెరిచి వో నెమలి బొమ్మా, రెండు పుస్తకాలూ నా చేతికిస్తూ "చెల్లికి తమ్ముడికీ" అన్నాడు.

"ఆరినీ....బాగా సెలక్ట్ చేసేవే" అని పుస్తకాల్ని చూసేను. వొకటి "ది సాగా ఆఫ్ అవర్ ఇండిపెండెన్స్" రెండోది "ది వరల్డ్ ఆఫ్ బర్డ్స్" నెహ్రూ బాలల సంస్థవారి ప్రచురణలు రెండూను.

"ఇవాళెక్కడికీ వెళ్ళొద్దన్నావని నాన్న కారు పంపిస్తానంటే వొద్దని పడుకున్నా- దా భోం చేద్దాం." అన్నాను. పుస్తకాలూ, బొమ్మా అందించి డైనింగ్ హాల్లోకి వెళతూ.

"చిన్నాయనగారూ! మున్నీ అచ్చు మీలాగే తెగ రిజర్వ్‌డ్‌గా వుండడం నేర్చేసు కొన్నాడండీ. రాజీ ఇలా కాదు - వొచ్చిం దగ్గర్నుంచి టాటా చెప్పే దాకా మమ్మీ మమ్మీ అంటూ వొకటె సోదె - ఆ తాడికొండ స్కూలు గురించీ వాడి పిక్నిక్‌ల గురించీ మా తమ్ముడూ మరదళ్ళగురించీనూ. ఇక చిన్నారి అంతా అదో తరహా. దానికొంచెం అన్‌హెల్దీగా వుందనీ మొన్నే మా డాడీ లెటర్ రాసేరు. పోనీ వోసారి చూసొద్దామంటే - ఎక్కడ తీరదను కోండి చిన్నాయనగారూ! పోనీ మీరన్నా వొస్తారేమో అంటే అదీ లేదు. ఆ బొంబాయి కాన్పూర్‌లలో వున్నప్పుడు అసలే లేదు. ఏదో కొంచెం దగ్గరి కొచ్చేం కదా మీ ఆవిడనీ పిల్లల్నీ తీసుకురండి" అన్నారు వదినగారు వడ్డన పూర్తిచేసి తాను భోజనానికి కూర్చుంటూ.

"కలకత్తా విజయనగరానికి దగ్గిరా!....వొస్తాం నే వచ్చిన మూడుసార్లూ అప్పటికప్పుడు అనుకొని బయలుదేరడవేం అయింది. ఈ స్వీట్లన్నీ ఎప్పుడు చేసేరు"

"లేదండీ - మామూలు వంట ఆ బెంగాలీ వంటావిడే చేస్తుంది. అవి కొన్నవే ఇవాళ సాయంత్రం ముగ్గురం సరదాగా ఏ రామకృష్ణా మఠ్‌కో



వెళ్దామనుకొన్నాను. కాని; అనుకోకుండా ఇక్కడుండే ఆంధ్ర మహిళా సంఘం ఇవాళే మీటింగ్ పెట్టింది. నేను సెక్రటరీని తప్పదు వెళ్ళాలి. కారు వొస్తుంది మీరిద్దరూ ఎక్కడికన్నా వెళ్లరాదూ."

"చూద్దాం సాయంత్రం కదా!" లేచి బేసిన్‌లో చేతిని కడుక్కొంటూ అన్నాను.

మేమిద్దరం విక్టోరియా మెమోరియల్నీ, అబ్జర్వేటరీ షోనీ చూచుకొని వచ్చేసరికి రాత్రి ఎనిమిదైంది. అప్పుడే అన్నయ్య వచ్చేడు. శేఖర్ మా కంటే ముందే భోంచేసి రేడియోగ్రాం రూంలో పడుకొన్నాడు.

భోజనాలయేక మేం ముగ్గురం డ్రాయింగ్ రూంలో కూర్చున్నాం.

అన్నయ్య సిగిరెట్ వెలిగించి "మరదల్నీ పిల్లల్నీ తీసుకురావలసిందిరా, సరదాగా సిటీ చూద్దురు కదా" అన్నాడు.

"అనుకోకుండా బయలుదేరేను.... శేఖర్‌కి ఈమధ్య ఓవారం వొంట్లో బాగోలేదు. అనారోగ్యం ఏమీకాదు మీ కోసం బెంగపెట్టుకున్నాడు; ఎప్పుడూ మీ గురించే ఆలోచిస్తుంటాడు. పోనీ వోసారి చూపించి తీసుకొద్దామని ఇలా తీసుకొచ్చేను........దానికేం గాని. మీరు ససేమిరా పిల్లల్నిపట్టించేకోమంటే ఎలారా" అన్నాను.

"అదేవిట్రా మరీ అలా పట్టించుకోవడం లేదంటావ్!! ఇంకా ఏం చేయాలి చెప్పు! ఆ మధ్య వొచ్చినప్పుడూ సూచావాచాగా ఇదే అన్నావు. ఉత్తరాల్లో సరేసరి. సరే. నీకిలా కాదు చెప్పడం-ఉండు!" అంటూ బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి ఐరన్ సేఫ్‌లోంచి వో మూడు పాస్‌బుక్కుల్ని తెచ్చి నాముందర టేబుల్‌పై పెడుతూ "వాటిని చూడు విడివిడిగా ముగ్గురిపేరా నెలనెలా ఎంత డిపోజిట్ చేస్తున్నానో! ఇదికాక తాడికొండకి నెలనెలా ఎంత కడుతున్నానో నీకు తెలీంది కాదు ఆపూర్లోనేవున్న నా బావమరిదికి కూడా సెలవుల్లో వాడిని చూసేందుకు వేరే పంపిస్తున్నాను. ఇక మా మావయ్యగారికి కూడా అంటే ఇంకా బొడ్డూడని పిల్లకూడా నేను డబ్బు పంపిస్తున్నాను. మరి నీకు ఏదో రీతిగా సర్దుబాటు చేస్తూనేవున్నాము కదా! ఏం ఇంతకన్నా ఏ తండ్రి తన సంతా

నానికి ఖర్చుచేస్తాన్నో చెప్పు. ఇంతకీ నీ వదినక్కూడా యీ క్షణందాకా చెప్పని వో సీక్రెట్ నువ్వు విన్నావంటే అదిరిపోతావ్-నువ్వంత ఇదిగా రెట్టించి రెట్టించి ఆమాట అంటున్నావని చెప్తున్నా విను - సరిగ్గా పన్నెండేళ్ళనుంచీ నా జీతంలో నయాపైసా నాకు గాని ఇంటికి గాని ఖర్చుచేసి యెఱుగనంటే నమ్ముతావా? అందులో ప్రతీపైసా పిల్లలకోసం పంపీ, డిపాజిట్ చేసీ - నేనేం అఘోరించినా ఈ నా ఇంటికేం చేసినా నేను కతికే నాతాల్తోనే అఘోరిస్తున్నాను?!" అన్నాడు అయిపోతున్న సిగరెట్‌తో మరోదాన్ని వెలిగిస్తూ.

"అలా విపరీతార్థాలుతీస్తే నేనేం చెప్పగలను కాని, కుర్రాడు మీ కోసం పడే ఆరాటం కళ్ళారా చూస్తున్నాను గాబట్టి అలా అనకుండా ఉండలేక పోతున్నాను."

"మీ మాటలకి అడ్డొస్తున్నానుగాని - చిన్నాయనగారూ మీరేవిఁటో అలా ఏవేవో చెప్తున్నారుగాని రాజీ హాయిగా వుండటం లేదటండీ?! చిన్న గుంటముండ కిజ్జీ హేపీగా మా డాడీ దగ్గర వుండటం లేదటండీ?! వాళ్ళు బెంగపడ్డట్టు వొక్క లెటరు నేనేనాడూ కళ్ళచూడలేదు........అయినా మాకు మాత్రం వుండదూ పిల్లలు దగ్గరుండాలని! కాని, ఎలా? ఈ మీ అన్నయ్య మాయదారి వుద్యోగంవల్ల పిల్లి పిల్లల్ని పెట్టి ఇల్లిల్లూ తిప్పిందన్నట్టు అవుతోంది. పైగా ఈ మహాపట్నాల్లో దినదినానికీ వాళ్ళరాకకోసం పోకకోసం పడే నరకం కన్నా దూరంగా వున్నా మీ దగ్గరా మీ దగ్గరా వుంటేనే క్షేమంగా వుంటా రన్న ధీమాకొద్దీ కన్నతీపి చంపుకొని పెట్టుకోవాల్సి వచ్చింది" అని వదినగారు అంటూండగానే అన్నయ్య-

"నువ్వూరుకో సరూ.... అసలు నీహెల్త్ కోపరేట్ చేయదు నువ్వెళ్ళి పడుకో ముందర....ఈ మాటల్లో మరిచేపోయేను. చూడు ఆ ఫ్రిజ్‌లో నిన్న ఆ కాన్టినెంటల్ హోటల్ సేట్జీ నీకు ప్రెజంట్ చేసేడుకదా ఆ జాడీ ఇలా తీసుకురా" అన్నాడు.

"ఆవిడను పొమ్మంటావెందుకు? ఉండనీ....ఆవిడన్నదీ రైటేగాని; రాజీ వుంటున్నది-సైకాలజీలో ప్రత్యేకంగా తర్ఫీదు పొందిన మాష్టర్ల కుటుంబం మధ్యలోనూ; సమవయస్కులైన పిల్లల మధ్యానూ పైగా నా దృష్టిలో వాళ్ళు



కూడా నాలాగే మీకు ఉత్తరాలు రాసివుండాలి. రాసిరాసి మానేసేనా వుండాలి! లేదా-తల్లిదండ్రుల్ని మరిపించే వాత్సల్యాన్ని చూపేవారో; అథవా అసలు కుర్రాళ్ళ మెంటాలిటీని కేర్‌చేయని వాళ్ళో అయి వుండాలి. ఇంతకీ రాజీ శేఖర్‌లు తోబుట్టువులేగాని వొకే మనస్తత్వం గలవాళ్ళు కావాలని లేదుగా!

నేను కేవలం శేఖర్ గురించే చెప్తున్నాను. వాడి ప్రతి కదలికా ప్రతి మాటా సాకల్యంగా అవగాహన చేసుకొనే చెప్తున్నా.

వాడికి నువ్వనే డబ్బు కాదు కావల్సింది. నాన్నచూపే అభిమానం ఆదరణా; నాన్నచేసే బుజ్జగింపూ; నాన్న పిలుపూ కావాలివాడికి! కనీసం నీ వాత్సల్యపూరిత సంబోధనతోవున్న వుత్తరం ముక్కైనాసరే. వాడు అత్యంత సంతృప్తితో స్వీకరిస్తాడు. వాడికి కావలసింది, వదినగారు అన్నా లేక అను కొంటున్నా పోషణా రక్షణా మాత్రమే కాదు తల్లిని "అమ్మా" అని పిలుచు కోడం; తల్లిని వాటేసుకొని ఆమెవొడిలో ఆదమరచి నిదురబోవడం; తల్లి అందించే అనుక్షణానురాగం - ఇవీ వాడికి కావాలి!

తోబుట్టువులు అనురాగంతో తిట్టే తిట్లకి మమకారంతో కొట్టే కొట్లకీ ఆ పసి హృదయం వేసారి పోతోదంటే మీ కర్థం అవుతుందా అని?!" ఆవేశంతో ఇంకా ఏం మాట్లాడేస్తానో అని తమాయించుకొంటూ ఎదురుగా వున్న అన్నయ్య సిగరెట్ పెట్టి తీసి సిగరెట్ వెలిగించేను.

"అసలు వాళ్ళిద్దరికీ కష్టంగా వున్నప్పుడు మీరు మరీను. ఆ తాడికొండ వాళ్ళంటే ఇన్కమ్ గురించి ఏదో కొత్తరూల్ పెట్టేరు గాని ఇంక స్టేట్ అంతా గొడ్డుపోయిందిటండీ? అక్కడెక్క......."

"వదినగారూ మీరా మాటంటే నేనొప్పుకోను. ముందామాట విత్‌డ్రా కండి....కష్టం ఏవిఁటి కష్టం?! నేనలా కలలోకూడా అనుకోలేదు. నా కొడుకొకటీ శేఖరొకటీ కాదు నాకు. అయినా నేనెందుకు కష్టమనాలి? వో చిల్లిగవ్వైనా వాడికి నే పెడ్తున్నానా యేం? ఇవాళదాకా వాడికోసం మీరు పంపిన మొత్తంలో వాడి చదువుఖర్చు పోనూ ఇంకా మూడువేల పైచిలుకు బ్యాంకులో మూలుగుతూ వుండగా నాకు ఇంకా కష్టమేవిఁటి?!....మీ అంతరాంతరాల్లో అంటుకు పోయిన అభిప్రాయం నా కర్థంకాక కాదు "వాళ్ళిద్దరికీ" అంటున్నారు. ఇక్కడ ఏదో

నా భార్యని మీరు వేలుపెట్టి చూపేరని నేనేదో వెనకేసుకొస్తున్నాననో లేచి వడుతున్నాననో మీరనుకోవద్దని ప్రార్థన! నా భార్య గురించి నేనుకాదు చెప్పాల్సింది. వెళ్ళి పడుకొని కలలుగంటున్న శేఖర్‌ని లేపి అడగండి!........మీరు వినలేరు! ఊహించలేరు ........మీరు నన్నంతగా గాయపరచేరు గాబట్టి. నేనొక్కటంటే వొక్క మాట - మిమ్మల్ని గాయపరచడానికే అనుకోండి; మీకు అర్థం చేయించే తపనవల్లే అనుకోండి అంటున్నాను మన్నించండి?!

నిన్నటి రోజుకు మీ జీవితంలోవున్న ప్రత్యేకత మీకు మరపురాలేదుగాని; మొన్నటి రోజుకువున్న విలువ ఏది ఈక్షణానికికూడా మీకు గుర్తువొచ్చిందా అని?;........"

"ఏయ్ సరూ. ఏవిటి చెప్పు ఆమాటలు? వూరికే ఆలోచనా పాలోచనా లేకుండా అనేయడం, ఏడవడమూను!....ఊ( నువ్వువెళ్ళి పడుకో! ప్లీజ్ వెళ్ళు సరూ" అంటూ అన్నయ్య ఆవిడ చేతిలోని జాడీని కప్పునీ అందుకొని టేబుల్ మీద పెట్టి; ఆవిడ బుజాలపై చేతులువేసి "ఏవిటి సరూ చెప్తూంటే ముందు కళ్ళు తుడుచుకొని వాడికి సారీ చెప్పి వెళ్ళు ప్లీజ్ నాకోసం"అన్నాడు"

నాకు చిటపట లాడిపోతోంది ఎలా నిల దొక్కుకున్నానో నాకే తెలీదు! "అదేవిటి ఆవిడ నాకు సారీ చెప్పడమేవిటీ. తల్లి లాంటివారు! అయినా నన్నంత చనువుగా మాట అనే వారెవరుంటారు?... నేనొప్పుకోను" అన్నాను. ఏష్‌ట్రేలో సిగరెట్‌ని నొక్కుతూ.

"ఊ( కూర్చోమరి ఆకప్పులో వాడికి వో ఐదుపళ్ళు సర్ది ఇయ్యి. ఏవిటో నా పున్నెంకొద్దీ ఈ వదినా మరుదుల గలాటాలో ఆ జాడీ జారి పగల్లేదు.''

"అది పగిలితే మీ గుండె పగిలిపోదూ ఈపాటికి! ఆ వెంటనే నా గుండె కూడా అనుకోండి.''

ముళ్ళమీద కూర్చున్నట్టుంది నాకు, యూఫోం సోఫామీదే కూర్చున్నా ఆ మాటల్ని వింటూంటే!

అన్నయ్య పెద్దగా నవ్వుతూ, ఆవిడ వెన్నుపై చేత్తో కొడుతూ "ఏం



జోక్ జోకేవ్ - అవునుగాని మనిద్దరి గుండెలు పగలడం చూసిన వీడి గుండెలు పంటాయిటే'' అన్నాడు ఇంకా నవ్వుతూ.

"నా జోక్‌కేంగాని - ముందు మీరు నవ్వకండి నాజోక్‌కి డోక్ గలరు" అంటూ పళ్ళు తేలుతున్న కప్పుని నా ముందుంచి; బెడ్‌రూంవైపు వెళ్ళేరు.

''అబ్బబ్బా - జోక్‌మీద జోక్‌వేసి చంపకే."

"మరి నీకో!- అసలివేవిటో చెప్పనేలేదు" అన్నాను. కప్పు క్రింద నున్న పొడుగాటి హేండిల్‌ని పట్టుకొని నోట్లోకి వో పండుపోనిస్తూ.

"నాకా - ఇప్పుడు మీ వదిన జోక్‌మీద జోక్ ఎందుకు వేసిందో తెలుసా, నోటి వాసనబట్టి! ఇందాక ఇంటికొస్తుండగానే వో నాలుగొన్నులు మిగించేను. ఇప్పుడీ పళ్ళు పడితే యింక నేను కంట్రోల్లో వుండను. అవి కూడా తీసుకో. ఈ మాత్రం తింటే ఏంచేయవు కాస్తంత మైల్డ్‌గా వుంటుందంతేమరి! నాలుగైదు పడితేగాని ఏం రంజుండదు వాటికి "ద్రాక్షాసవంలో నానేసిన ఆలివ్ పళ్ళు" అని అనువాదం చేసుకోవచ్చు గాని అంతా ఫారిన్ ఇంపోర్ట్! జపాన్ మేడ్! అక్కడి ఆడంగులు తెగ మోజుపడి గుటుక్కు గుటుక్కుమని వీటిని మింగుతారట!

ఒరే నువ్వు ఏం అనుకో. అంటే ఐమీన్ నువ్వేం అనుకున్నా నన్ను మాత్రం పల్లెత్తుమాట అనకూ అని నా అభిప్రాయం కేవలం విను........

లైఫ్‌ని ఎవరికోసమో రూయిన్ చేసుకోవడం ఉత్తినాన్సెన్స్! ఇటీజ్ మై పోలసీ కనీసం ఫేమిలీకోసం కూడా నా లైఫ్‌నీ, నా ఆనందాన్నీ నేను శాక్రిఫైస్ చేయను. ఇటీజ్ మై డిటర్మినేషన్! అసలెవడన్నా ఎందుకు చేసుకోవా లంటాను? ఈ విలువైన జీవితాన్ని, ఈ అంతులేని అభిరుచుల్నీ వీలైనంతగా బ్రతికున్నంత కాలం అనుభవించక ఎవరికోసమో ఎందుకు మానుకోవాలి? నాకు తెలుసు. నీ దృష్టిలో లైఫ్ విలువ వేరని. కాని నాదృష్టి నాదే అలా అని నన్నాసుకొన్న వారెవ్వరికీ నేను అన్యాయం చేసి నేను పాయిసాలు త్రాగడం

లేదు పైగా మరో ముఖ్య విషయం. నావల్లా. నాబలహీనతల వల్లా నన్నాను కొన్నవారు పాడైపోవడం నేను టాలరైట్ చేయలేను. ఇందాక నీవన్న పాయింట్ దగ్గిరికే వొస్తున్నా. నా పిల్లలు నా దగ్గరే వుంటే అంటే ఈ పొల్యూటెడ్ ఎన్విరాన్మెంట్ లోనే వుంటే ఇక వాళ్ళగతి చెప్పక్కరలేదు. అందుకే దూరంగా ఎంతో దూరంగా వుంచేను.

నిజంగా నేను మనస్సాక్షిగా చెప్తున్నా. నాదీ నీదీ వొకే రక్తం. వొక్కొక అర్ధరాత్రి నా పిల్లల మమతలకోసం నా పిల్లలచేతి తాకిడికోసం నేనెంత విలవిల లాడిపోతానో నాకే తెలీదు కానీ, ఇలా అనుకొనే క్షణకాలాల్ని నేను కోరుండే బలవంతంగా దూరం చేసుకొన్నాను. ఈ నా తీయని అందాల జీవితంపై నాకున్న మక్కువ కొద్దీ!

ఇక్కడ మరో సంగతి తడవాల్సి వుంది మరేం లేదు నీమనస్తత్వానికి తగిన భార్య నీకు జతపడినట్లే నా మెంటాలిటీతో సరిగ్గా ఏకీభవించే భార్య నాకు దక్కింది.

ప్లీజ్. ఈ నా మాటల్లో వొక్క అక్షరాన్ని కూడా నువ్వు కామెంట్ చేయకు. ఇదంతా స్పృహతోనే మాట్లాతున్నా. నా మోతాదు ఐమన్నరౌన్సులు.

అదేవిటింకా రెండు పళ్ళు మిగిల్చేవు నిజంగానే ఎనిమిది దాటేదాకా ఏం చేయవు. నువ్వసలు నోరు మెదపకుండా వాటిని నోట్లో పడేసుకు చప్పరిస్తూ హాయిగా వెళ్ళిపడుకో-" అని లేచి; "మరో రెండు మాటలు చెప్పాల్సివుంది-

"నాకు పిల్లలపై మనసులాగా ఈ నీరెండ వెచ్చందనాలపై నువ్వెప్పుడు మనసుపడినా ఎలాంటి అరమరికా లేక రా. నాకు సంతృప్తి కలిగించు. అలాగే ఇందాక ఏదో ఎకౌంట్ చెప్పేవు........ఇంటికి వెళ్ళిన వెంటనే ఆ డిపాజిట్ను విత్డ్రా చేయి ఇక నా కెప్పుడూ ఆ రకంగా బాధని కలిగించకు.... ఎస్.... ఇంకనే చెప్పేదేం లేదు. వెళ్ళిపడుకో" అంటూ బెడ్రూంలోకి వెళ్ళేడు.

కప్పులో వైన్తోబాటు రెండింటినీ నోట్లో వొక్కసారి పోసేసుకొని,



బెడ్డింగు తీసుకొని పై అంతస్థుపైకి పోయేను. కలకత్తా వస్తే అక్కడే పడుకోవడం నా కలవాటు.

వెన్నెల కలకత్తా అందాలికి మెఱుగులు దిద్దుతోంది దూరంగా ఆవైపు లీలగా కన్పించే హౌరా బ్రిడ్జీని మెలికలు తిరిగిన నదినీ; ఈ వైపు సుస్పష్టంగా కనిపిస్తున్న విక్టోరియా మెమోరియల్నీ; దిగూగా రోడ్లపై అర్ధరాత్రి అవుతున్నా ఆగని జనప్రవాహాన్ని వాహనాల్నీ చూస్తూ నిల్చున్నా, సిగరెట్ పొగల్ని వెన్నెల్లో కలుపుతూ.

"నాన్నా! మనం ఎప్పుడు ఇంటికి వెళ్ళిపోదామండీ."

తుళ్ళిపడి వెనక్కి తిరిగేను. శేఖర్?! "ఏం నాన్నా. దా. ఇంకా పడుకోలేదా?" అన్నాను దగ్గరకి తీసుకొంటూ.

"ఇప్పుడే తెలివి వొచ్చింది. మీరు స్వెట్టరు మర్చిపోయేరని తెచ్చేను."

"అరినీ. అయితే ఇంతసేపూ నాన్నా. నేనూ మాట్లాడుకొన్నవి విన్నావా?"

"లేదండీ. ఎందుకో ఇప్పుడే తెలివి వచ్చింది...... రేపు ఇంటికి వెళ్ళిపోదాం."

"అదేవిటి నేనింకా నాలుగురోజులు సెలవుపెట్టి వొచ్చేను. ఇండియన్ మ్యూజియం, బాలవిహార్. బొటానికల్ గార్డెన్స్-ఇంకా ఎన్నో చూడద్దూ?!"

"ఈసారి తమ్ముడూ వాళ్ళతో వొచ్చినప్పుడు చూద్దాం. ఇంటికి వెళ్ళిపోదాం" అటు చూస్తూ అన్నాడు.

"సరే నీ యిష్టం. వెళ్ళిపోదాం రేపే వెళ్ళిపడుకో."

"నేను ఇక్కడే మీదగ్గిర పడుకొంటాను."

"అరి రాస్కెల్! అదా సంగతి. దా. మరేం ఇవాళనుంచీ నువ్వు నన్ను "మీరు" అనిగాని "అండీ" అనిగాని పిలవకూడదు. తెలిసిందా!" అన్నాను. పక్కమీద పడుకొన్న వాడిమీద చెయ్యేసి పడుకొంటూ.

వాడి శరీరంనుంచి శ్రీనాథుడి శరీర స్పర్శ నా శరీరంలోకి వెన్నెలకన్నా నున్నగా సుతిమెత్తగా ప్రసరిస్తోంది!

—'భారతి', 1980 జూన్.



# ② గీత

ముట్టె పైకెత్తిన యెలుగ్గొడ్డులావుంది వెలగాడ కొండ! ఈ కొండగుర్తు చెప్తేనే చాలు యెంత కొత్తవాడైనా సరే విజయనగరాన్ని యిట్టే పసిగట్టేస్తాడు. రాళ్లు పొదిగిన నీలి ముఖమల్ కిరీటంలాగా కనుచూపు మేరనుంచీ కనిపించే ఆ కొండ మీది ధనంతి అలనాటి రాచరికం ఠీవికి విలాసానికీ గుర్తుగా నిలిచి వుంది. ఆ కొండ దిగూగా దక్షిణం తట్టుమీద నుంచొని చూస్తే—

వొకటీ వొకటిన్నర కిలోమీటర్ల దూరంలో ప్రారంభమయ్యే నగరం పొలిమేర అర్ధచంద్రాకారంగా కొండని తాకుతూ కనిపిస్తుంది. ఈ మధ్య జాగాలో యెక్కడపడితే అక్కడున్న తాటి పెండెలూ యీత తోపులు; చెదురు మదురుగావున్న వేరుసెనగ పొలాలూ; అక్కడోటీ యిక్కడోటీగా వున్న తోటలూ; వీటన్నిటినీ అడ్డుగా చీలుస్తున్న రైలుకట్టా కనిపిస్తాయి. తలకొట్టిన తాటికాయ మీద ముంజెలు కనిపించినట్లుగా మూడు చెరువులు కనిపిస్తాయి! తూర్పువైపు దూరంగా వున్న కిత్తయ్య కోనేటికి కొంచెం యెడంగా వీరబ్రహ్మం గారి మఠమూ, యేతవీధి కన్పిస్తాయి. ఇక పడమటి వైపు దూరంగా నగరం పొలిమేరల్లోంచీ మెలికలు తిరుగుతూ బుచ్చన్న కోనేటినీ, పరసయ్య కోనేటినీ శ్మశానాన్నీ రాసుకొంటూ తిన్నగా కొండ వెనుక తట్టునున్న వెలగాడ వూరికి పోయే నాటురోడ్డు కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది.

వెలగాడ కొండ నిండా దట్టంగా చెట్లుండడం వల్లా; వెనకనుంచీ గొలుసుకట్టుగా కొండలూ వాటిమధ్యనున్న లోయల్లో చిట్టడవులూ వుండడం వల్లా అడపా తడపా కొండమీంచి చిందువులూ, కలివిం గోలలూ, చిట్టడులూ, ఎలుగుబంట్లూ రావడం కద్దు.

కిత్తయ్య కోనేటికి పడమటి వైపున్న తాటిపెండె మధ్యలో దిగూన వీరాసనంలో సింహాచలం ఖాళీ కల్లుకుండల మధ్యగా కూర్చొని, కాలికింది అదిమిపుంచిన గీతబడితె మీది చిన్నసొట్టలో రాతిపొడి చల్లి కత్తిని సాన బడుతున్నాడు.

సాయంకాలం నీరెండ తాటి మొవ్వల్లో పడి మెరుస్తోంది. గాలికి తాటి మట్టలు వొకదానికొకటి మాటిమాటికీ వూగుతూ తగలడంవల్ల గలగలమని శబ్దం వొస్తోంది తాటి మానుల వెనక నుంచి యెండ దిగూన పడడం వల్ల నేలంతా గీతల్లాగ పడిన నల్లనినీడలతో తెల్లని యెండ చారలతో జీబ్రా చర్మాన్ని పరిచినట్టుంది.

సింహాచలం సానబడుతూ పడుతూ గీతాన్నందుకొన్నాడు.

"పస నేమర యీసంసారవుఁనోపల - యిసుటుగ తిరగకురోరన్నా
పనిట కాయలో పురుగు సందవుఁన - పుసుక్కుమనురోరన్నా!"

ఇంతలో అతని కొడుకు పైడితల్లి వో చెట్టుమీంచి దిగేడు. కండలు మెలి తిరిగిన ఇనపకమ్మీలాంటి శరీరం మీంచి చెమట మెరుసుకుంటూ కారుతోంది. నడుమకి చుట్టూరా చుట్టిన మోకు వీపువైపు నడుంకి కట్టిన బల్లకి తగలడంవల్ల టక్కుటక్కుమని శబ్దం వొస్తోంది. మూతులికి పగ్గాం తప్ప బిగించి రెండు చేతుల్తోనూ పట్టుకున్న కుండల్లోంచీ తెల్లని నురగలు. ఎగజిమ్ము తున్నట్టుండగా తండ్రివైపోస్తూ "వోరయ్యా! మేటిమద్దేలక్కట్టిన ఏడుతట్టిల్లోన్కి సందేల నాలుగాటికే పూరా కల్లాడిసిపోనాది! యీ పోతుసెట్టు వొడిసిపట్టుగా పెండిల మనం హర్రాజు సేసీన సెట్లనీ వొడిసేసుకొచ్చి నయ్యంటే బాగున్ను- తన్నలబంద - మున గుడిసె వూడనాగేసి ఆ కొండమీదున్న మేడ నాంటి మేడన్నే పేద్దువుఁ" అన్నాడు. పదిలంగా కుండల్ని తండ్రి దగ్గర పెట్టి; పక్క నున్న తాటి మొక్కనుంచి వో కమ్మని కోసేడు. దాన్ని రెండుగా చేసి మంచి వొడుపుగా బొటనవ్రేలితో నొక్కిరాస్తూ చిన్న గిన్నెలా మడిచి కొసల్లో మడి పడేలా ఆకుమెలేసి చక్కని రెండు పాయల్ని చేసేడు తన కత్తిని బడితెదగ్గర బెట్టి, సానబెట్టిన కత్తిని బల్లలో పడేసుకొంటూ, దిగూన గొంతుకిల్లా కూర్చున్నాడు.

సింహాచలం మాట్లాడకుండా కళ్లు మూసుకొని కల్లుకుండలకి దణ్ణంపెట్టి; కొడుకు చేతిలోంచి వో పాయను తీసుకున్నాడు. కుండలో నురగ పక్కకు పోయేలా మెల్లగా వొంది, చిన్న మట్టిముంత ముంచి పాయనిండా కల్లుపోసేడు. ఆ పాయని దోసిట్లో తొణక్కుండా పట్టుకొని అలానే పదిలంగా పైకెత్తి



ఆకాశంలోకి కళ్ళు మూసుకు చూస్తూ కొంచెం సేపుంచేక; దించి కళ్ళకద్దుకొని కొడుక్కి అందించేడు. రెండోపాయలో తనకు పోసుకొని కొంచెం కొంచెం తాగుతూ——

"వోరి ఆసెట్టుతో కడం సెట్లకి పోలికేటిరా? ఆసెట్టు వొనలచ్చిమి. నువ్వు మీయమ్మ కడుపుల వుండగా ఆసెట్టు పుట్టినాది దాని థాన్శిబొరికిని మనకి నిదానంగున్నాది సూడు ఆసెట్టు నించి నాసేతుల్తో నాను తీసి పాతినానుర. ఆసెట్టు బురుకుని ఆకాడ యెనగాడ రోడ్డు మదుంకాడి పుంతలవున్న వొంకర సెట్టునించి మాబాంబుఁ తీసి. నాను నీయంత జబర్దస్తీగున్నప్పుడు పాతినాడు. ఆ వొంకర సెట్టుకి నాను మాయమ్మకడుపుల వుండినప్పుడు మా తాత టెంక పాతినాడు.. యేటో వుండనేక మనవిఁలా టెంకలు పాతుకోడవూఁ మొక్కొచ్చి పెరిగినాక సరకారోళ్లు అంకెనేసి అబ్కారకి యేలంవెఁయ్యడవూఁను!....నాను సెప్పేదేంటంటె ఆ సెట్టుకి జోడీగున్న సెట్టు యీ కవఁతం మొత్తం యీకాడికి నేదు యి నాక్కత్తితో గీతలెట్టినానంటే సాలు జిలజిల వూటనాగ సెపురుసు కొచ్చేత్తాది.

"యేటిర నీపిచ్చి గాని యేటి మనం పాడుకున్న అరపాతిక సెట్లూ పూరా వొడుసుకుంటెనె మనం మారాజులవైఁ బవంతుల్నెపెత్తావేఁటిర అనా సూసినావా- ఆసెట్ల నీడలు ఎలగ్గీతలమ్మటా యెనాగున్నయో! మన బతుకు లన్ని నీడల్లాంటివిర ఆపెద్దోల్లందరి బతుకులు యెలుతురు నాటివిర! వోరి యెనాటెనాటోల్లెందరొచ్చి యేటి సేసిన మనవిఁడిగిలాగె వుంటవు! యీ పెపంచకం నోంచి పూరాగా నీడలే కాడికన్నా యెగురుకు పోతయ్యేటిరా! నీడల్ని దొరకబుచ్చుకు తగిలెయ్యడవుఁ యెవురి వొసెం?!- మన గెలసారవుఁ నుదుట్ల గీతా బాగుపడాల అంతె గానీ మనవెఁప్పుడికింతెర మనవెఁక్కడ - మేడ లెక్కడ?! మనం అదప్పాతానంల వుంటె అదిగనాగ మేడలు అంతెత్తు నుంటాయిర! మనం సచ్చినా ఆటి నందుకోలేవుఁ మనవుఁ బెత్తాయిఁసుకొన్న కాడికి అన్ని సెట్లోకనాగ దిగితే కసింత నయంగ మరోటి కాడ సెయ్యి సాపకుండ అప్పుల మనక్కుండ గడుత్తాదంతె. అంతకన్నేటో మన కొంగి పోతాదని ఆసెట్టుకోకురోరయ్యా! ఆసె మాసెడ్డది. నానన్నదంత.

"అటుయిటు పాటులు యీ సంసారం-
ఆసెలు నమ్మకురోరన్నా
ఘటము పుచ్చిన కుక్క సందమున-
లొటలొట తిరగకురోరన్నా!"

అని యెంత యిసిదంగా సెప్పినాడో సూడు" అన్నాడు ఖాళీ పాయని దూరంగా విసిరేస్తూ,

"వొరిగి పోతాడో నేదో అకాసి పెంటమ్మెట్టిన సారాబట్టీ సూసినా. యీకాసి తాడయ్య కల్లుపాక సూసినా తెలుసుకు పోతాది. అకాడికి యెవ్వుఁకీ లేని సత్తెకాలబ్బుద్ధి నీకే వొట్టుకున్నాది. కల్లుతట్టికి నోపల్న సున్నవఁయినా పులవఁనీయవు. కసింతయినా కల్లు మురసంగున్నాద మా మీఁదిరుకు పడిపోతావు. కోటాకలుపు కోప్పకోవుగందా! మరి మనవుఁవాడుకొన్న సెట్లయేరు మూడు సెట్లకియ్యేల దాకింకా పాలైన దిగనేను కల్లేటి దిగుతాది? కడుం సెట్టుల నిఁచి దింపింది దింపినట్టుగ అమ్మేసినామఁటే మరి మనవేఁటి యెనకేసుకొంటావోఁ సెప్పరయ్యా!"— పైడితల్లి ఇలా అంటూనే వోరెండు ఖాళీకుఁ డల్ని పట్టుకులేచి, ఎదురుగావున్న వోచెట్టు దగ్గరకి వెళ్ళి మానుకి మోకుని మెలేసి చుట్టి; చెట్టుకి దణ్ణంపెట్టి, కాళ్ళకట్టుకొన్న త్రాటిని మోకునూ మీదకు జరుపుకొంటూ చెట్టెక్కడం మొదలెట్టేడు

"వోరోరి వొల్లకుండరేసి. యెదవ అన్నేయాని కొగ్గి డబ్బు సేసుకుంటా నంటావేటిరా! ఆల్లెవులో గత్తర తినుకొన్నారన యేటి నువు కూడా తిండానికి అవిఁరి పోతావేటిర సెప్పు సీ—యెదవ బతుకు అన్నేయబ్బతుకు బతికేకన్న గంజినేక సావడం మంసిదని వొంట బట్టింసుకోరా బాగుపడతావు. —వోరి! పెంటమ్మ నా బంగారమ్మెడెత్తుకొని వో పాలి నా కాసి యెగాడిగా సూడమని సెప్పి సూడరా- సూడగలుగద్దేవోఁ?!- సఫ్! తలెత్తుకు తిరగలేని బతుకెందు కెటి. మడిసి జల్మమెఁత్తినాక నిజాయితీగుండాల. ఆ తాడయ్య గాడు నీకు గురేటిర! ఆడెన్ని సుట్లు పోలీసుల పాలయిపోయిడో; ఆడిరకాయించుకొన్న సొమ్మంతా యెవాగ రోగాలికీ రొచ్చులకీ కరుసయిపోతన్నాదో వోరయ్యా నీకు తెల్దేటి?- మురగబెట్టిన తట్టి మడ్డీ, గెంజీ, రిట్టకాయల పులుసూ— యీ నెక్కన నానా గడ్డీ మురసరంగదింపిన కల్లులకలిపేసి యేటి యీళ్ళకాడ తాగిన పున్నేనికి



యేడు తిరక్కుండగానె సంపేత్తారేటిర జనాల్ని?! ఆల్లైనా సచ్చిపోతే యీళ్ళ కేటి!— యీళ్ళకి డబ్బే పెదానవైఁ పోనాది. సీ— నాబొందిల పేనం వుండగా నేను సెయ్యనూ సెయ్యనీను" అన్నాడు సింహాచలం రెండు కుండల్లోవున్న కల్లునూ కడవలోకి గుమ్మరిస్తూ.

"వోరి బాఁబూ! నీకా యీరబమ్మంగోరి మటంకాడి కబుర్లు పూరా తలకెక్కిపోనాయి-మరి నా కబుర్లేటి రుసిత్తాయి నే!.... నానేటి మనకాడ తాగడాని కొచ్చి నోల్లందరిని సంపేసి ఆ సొమ్మట్టుకు మనం మేడలేపుకొందవఁన్నా నేటిరయ్యా?!— పొద్దొచ్చేక్కట్టిన సట్టిని పొద్దు గూకినాకా; మాపిటేలకట్టింది పొద్దొచ్చేదాకా యిప్పుదవఁన్నాను. ఏరు సట్టెల కాడ వో అరసట్టీ నెక్కన నీరు కలపమన్నాను. ఈ కాటికే గదమాయించుకు నామీదెగిరి పోతన్నావు.

వోరయ్యా యీ యేటికి పాట సెట్టుకి నాలుగు పదులయిపోనాది. ఆ ఆపీ సోల్లకి రివాజులిచ్చుకొనే తలికి సెట్టుకి యేబయిపయి సిలుకయి కూకున్నాది. ఇంకేటి బావుఁకుంటావోఁ నువ్వే పరకాయించు సూసుకో" అన్నాడు పైడితల్లి మొవ్వలోంచి. కల్లుదిగిన కుండల్ని జాగ్రత్తగా తీసి, కొత్తకుండల్ని కట్టేడు. కత్తి తీసుకుని మొవ్వలో గెల వెన్నులకి వెడల్పుగా ఎడగీత చెక్కి; గీరావడి చుక్కలు నేరుగా కుండలో పడడానికి సన్నగా పొడుగ్గా చెక్కివుంచిన కమ్మ రేకుల్ని వెన్నులోకి దిగూన గుచ్చి రేకుకొసల్ని తట్టిల్లోకి జార విడిచేడు. తట్టి మీద గుడ్డా, తాటేకులూ కాకులు తాగేకుండా మూతేసేడు. మెల్లిగా మోకుల్ని దిగూకి నెట్టుకుంటూ దిగుతున్నాడు.

"అయితే నువ్వు నేదేటిర!— అబ్కారి పెంచేత్తే నువ్వేటి నీసేద్ది యెట్టు కుంటున్నావేటిరా! అరవయి పయిసాలున్న సీసాకాయిని రూపాయికి నువ్వు పెంసుకుపోనేదేటి? మరి దానికిది సెల్లయిపోనాది కాదేటిర! నీ కలితీ కల్లుతో నీకాడి కొచ్చినాల్ల కడుపులన్నీ గుల్లసేసి నీ కడుపు నింపుకుంటావేటిర! వోరి నువ్వేటి కానుకోవడం నేదు- నిలూనా సెడిపోతావుఁర. మనకెందుకేస్- ఆ అన్నే యబ్బదుకు"- అని అంటూ సింహాచలం వో రెండు రాళ్ళని తీసుకొని వొకదాని మీద వొకటి టక్కూటక్కుమని కొడుతూ బడితే గతకలో మెత్తని రాతిపొడి పడేలా చేస్తున్నాడు.

"అన్నేయ వన్నేయవని తెగకోపవై పోతన్నావు - వోరి బాబోఁ నాను సూటిగ అడగతన్నాను సెప్పర!- యీగీతపనీ యినాక్కల్లమ్ముకు బతకడవూఁ అన్నేయవ్వనులుగావేటిర!- మా సెడ్డ కబుర్లాగ్గేత్తన్నావు?!-" చెట్టు దిగి ఉదుటుగా తండ్రిదగ్గిర కొచ్చి కల్లుకుండల్ని పక్కగా పెడుతూ కొడుకు అన్నాడు. పక్కన డి డి టి పౌడరున్న చిన్న గుడ్డమూటని తీసుకొని మళ్ళీ తాను చెట్టు దగ్గిర కెల్లేడు. మానుకి చుట్టూరా నేలకి వో అడుగుయెత్తున కత్తితో సన్నగా చెక్కిన చిన్న గతకలో పౌడర్ అంటేలా చీమలు చెట్టుపైకెక్కకుండా గుడ్డ మూటని మెత్తగా కొడుతున్నాడు. నల్లని మానుపై తెల్లని వెండి కంకణాన్ని తొడిగినట్టుంది- అలా చేస్తుంటే.

"యిదేటిరోరయ్యో మతోయినాదేటి నా పనిల తప్పెంచతన్నావు నీకేం నెరవఁ?! మన పనికేటొచ్చినాదిర అన్నేయవ్వూఁ?! మన కులవోల్లకి ఆనాదిగ యిదే కదేటి యిదాయకం. సెట్టుతల్లినమ్ముకు బతికే వోళ్ళం మనకేటిర తప్పొరిగిపోనాది! అయితే వోరయ్యో- గవేలాలో పీకెల్నరికే వోడికీ, వొల్ల కాటిల పీనుగుల్నాక్కెల్లే వోడికీ, జయిలల కాయిదా యెట్టేవోడికీ నువ్వేట న్నేయవెంచుతావేటిర? ఎవురి యిదాయకాన్నాల్లు సేసుకు పోడవ్వుల అన్నేయ వ్వేటినేదుర- మన పనిల యేదన్నా కలతీ సేసినావాఁ; మన యిదాయకానికి యిరుద్దంగా ఎవురన్నాగాని పొట్టనెట్టేసుకొన్నావాఁ-అదిగదిర అన్నేయవంటే!" ఇలా సింహాచలం చెప్పుకు పోతుంటే పైడితల్లి దగ్గరున్న చెట్టని ఎక్కుతూ దిగితూ వింటున్నాడు—

"వొరె కల్లంటె సెట్టుతల్లి లోకానికిచ్చిన వొరపెసాదవ్వుర - వొన లచ్చిమి యిచ్చిన అమురుతవ్వురా! ఈ పెపంచకంలో వొనలచ్చిమిచ్చే తేని సానాసానా గొప్పదిర. దాన్ని సెప్పినాక దీన్నే సెప్పుకు తీరాలిరా. మరందుకే గదేటి తేని దొరక్కుండున్న యేలల్లా తేంటీగలూ, యెలుగ్గొడ్డులూ దీన్ని జుర్రుకు పోతాయి. వోరి సీవఁలూ, కాకులూ కూడా దీనికెగబడతన్నాయంటే దీని యిలవెంతున్నదో తెలుసుకోరేయ్!

గాంధీ తాత నాంటి వోడు యీ తీపికల్లుకున్న యిలవని యిసిదం సేసుకుని సారాబట్టీలన్నీ రద్దుసేయించి యీ గీతపని నల్లగుండాలని దీవించి నాడు రోరయ్యా!



ఆ మద్దిల యిస్కూల్ల పనిసేసె పంతులు బాబొచ్చేవోడునే- ఇది తాగటానికి. ఆ బాబు మా గొప్పగ అదేటో యింగిలీసు మాటలతో సెప్పినాడునే! నాకేటి నోరు తిరగదు. యీ భూపెపంచకంలో - దంపుడు బియ్యమిచ్చే సత్తువా; ఇదిగీ తీపికల్లిచ్చే సత్తువా - మరేకాడా, నేవేనేవుటోరయ్యో!"- అని అంటూ కొడుక్కి మరో పాయకల్లు అందించి; తాను కొంచెం పోసుకొని మళ్ళా అందుకొన్నాడు-

"అసలు దీని యిలవ మనోల్లెవురికీ యిసిదవేఁగానేదుర!- యేటి మన కులపోల్లంతా సంగవెట్టుకొని; అయిదరాబాదు సబనోకి మనోన్నొకన్ని అంప గానే అయిపోనాదేటిర! వొరె యెందుకిరయన్నీ - సంక నాకను!- నువ్వినుకున్నావోనేదో - మొన్న తాగడానికొచ్చిన జవానుబాబు సెప్పినాదుర - పేపరుల సదువుకొనొచ్చి సెప్పినాదుర! ఆ సెన్నపత్తనం సరకారోల్లు యీమద్దిల అన్ని యిస్కూల్ల సదువుకొనె బుడ్డోల్లందరికీ పొద్దు గూకులా రివాజుగ యీ తీపికల్లు మోతాదుల తాగింసేనాగ తాకీ దిచ్చినారట వోరయ్యో యినుకుంటున్నావో నేదో! మన కన్న ఆల్లే మిడునుగ మంచిపని సేసినారు కాదేటి!

దొరికిన కాడికి రోజు కిడవకుండ యేరు పొద్దులమ్మటా తీపికల్లు తాగిన మడిసి యెనాగుంటడు తెలుసా - యినప కమ్మీ నాగుంటాడు తాటికల్లుని తాగినోడు తాటి సెట్టునే వూపెయ్యాల!- యీముదనట్టపోల్లు ఆల్లూగి పోడానికీ వొల్ల తిమ్మిరెక్కిపోడాకీ మురసంగున్న కల్లు తాగి మన పరువు తీత్తన్నారుగాని మన కేటిర తప్పు!

వోరి సెవినెడుతున్నావో నేదో - మరోటినుకో! మా బాబుకాలం తీరిందాక మనకీ పాట నేదు పాడూ నేదు. మురసంగ కల్లమ్ముకొనే వోడికే పాట. మనం తట్టిలికి పయినింత గొద్దిసున్నంపులివిఁ కల్లొడిసి పట్టినాక తాటి బెల్లం వొండుకు బతికేవోల్లం. ఇయ్యాలకి జనం ఆ వూసే మరిసిపోనారు. జరుగుబాటు నేక ఇయ్యాలకా బెల్లం పదునే మనం మరిసిపోయి ఆదొగ్గేసి యీ తీపి కల్లుకే అవిరిపోనాం" అంటూ నూరిన రెండు కత్తులూ బడితెమీద పెట్టి; తాటాకులు కోసి ఐదారు పాయలుచేసి; ముంతనీ, సీసాని కడవ దగ్గిర గడ్డిమీద పెట్టి; కావిడితీసి ఖాళీకుండలు జాగ్రత్తగా సర్ది పేర్చి వుంచేడు.

"వోరి బాబా! నీతో నాకేటిగాని - నేనా యెనగాడ తోవకాడి పుంతకి యెల్లొత్తాను నానొచ్చిందాక పదిలంగుండు" అంటూ తండ్రి సర్దిన సరంజామానీ కావిడినీ తీసుకొని పైడితల్లి బయల్దేరేడు.

"వోరి సిటంసేపు సరకాయించుకెల్ల కూడదేటిరా! మాయేడి మీదున్నావు ఆ కుర్ర మూకెవురయినా కంటబడి నారంటె యిరుసుకు పడిపోకురయ్య -- నా నాల్లకొనేది నేను. నీ పని చూచుకు బేగి పొర్రా. ఇయ్యాల మటంకాడి బజనకి నా నెల్లాల- వోరోరి ఆ కడం సెట్టుకాడ నేలంతా మెన్నొడిన సినుక్కి ఇవట గుంటాది నిదానం గెల్లరోయి!.... వోరి నాను మరిసేపానాను— మటం కాడ బుడ్డోల్లందరూ "గీత తాతా! మేత తాతా! అని నా సేతులట్టుకు సుట్టూరా తిరుగులాడతార్రా—అల్లకి నేతగున్న తాటి మొవ్వో యీత మొవ్వో కోసొట్టు కురారా!"ఇలా కొడుకు కనుమరుగయ్యే దాకా సింహాచలం అంటూనే వున్నాడు.

బాగా సాయంత్రమైంది గూళ్ళకి వెళ్ళే పక్షులగోలా, గాలికికదిలే తాటా కుల గలగలా మినహాగా అంతా ప్రశాంతంగా వుంది. ఆ ప్రశాంతతని రెండు మూడు నిముషాలు భగ్నం చేస్తూ వో రైలు టకటక మని వేగంగా పోయింది.

క్రమంగా వొక్కొక్కడూ తాగడానికి వొచ్చి వెలుతున్నారు. ఏవేవో కబుర్లూ, డబ్బులు యిచ్చి పుచ్చుకోడాలూ జరిగిపోతున్నాయి ఇంతలో

"వోరి మావాం యెనాగున్నావేటి? మా యప్ప బాగున్నదా? మీ బుడ్డోల్లిద్దరూ సేక్షుకంది కొచ్చినార్రా'' అంటూ ఎరకయ్య వొచ్చేడు. చేతిసంచితో వున్న రెండు ఖాళీ బీరు సీసాల్ని తీసి కిందపెట్టి సంచిపరుచుకు కూర్చున్నాడు.

"యేటేటి యెరకయ్యే - వోరోరెన్నాల్ల కవుపి సినావురా! ఆనాడెల్లినావు అద్దదే పోక మరిటు నేదు. మమల్ని వొపాలి సూడాలనిపింస నేదురా! యిప్పుడెక్కడేటి నవుకిరీ?— నా యాడది అనాగే యింటిల సాకతన్నాది— ఆ మద్దిల మా పెద్దోడు తాడేలు కాటుకి తాటిసెట్టు మీంచీ కూలిపోనాడు రా....... యేటో ఆడేటి నా మాట నినుకొనే రకవేంటి? మా యిద్దరినీ సరుకు సేయకుండా యేరుబడి పోయి సారాబట్టీ యెట్టినాడు. ఆడన్నోయవేం తాడేలు గొచ్చి- మా కడుపులు కొట్టేసినాదనుకో!.... నువ్వెల్లేతలికి సిన్నగుంటడు గుండేవోడు గందా ఆ పైడితల్లిగాడే యియ్యేలకి మమ్మలిద్దర్ని సాకతావొత్తన్నాడు.



ఆడికింకా పెల్లి సెయ్యాల.... నన్ను సూత్తన్నావుగదర. నానిలా బయిటి కవుపించడవేం దేనికీ పనికి రాకుండ గున్నానుర. యేటో పైడిబాబు గోడు కసురుకు కూకోమన్నా పొద్దుగూకులా యింటికాడుండనేక వో సుట్టిలా ఆడికి సేతి సాయంగుటానని వొచ్చి కూకుండబడిపోతన్నాను. యె నాగుండే వొన్నె లాగయి పోనానొ సూడర. కాటిక్కాలు సాపుకొన్నట్టయిపోనాదంతె!....

'సచ్చేటందుకు పుట్టియున్నవు - సందుల దూరకు రోరన్నా!
యెన్నాల్లుండిన యవుడు యిడవదు - యెందుకు జడిసేవోరన్నా!'

వోరెంత బాగా సెప్పినాడో యినుకొన్నావా" అంటూ పింహాచలం వో పాయనిండా కల్లుపోసి ఎరకయ్య కందించేడు.

"నీ సేతుల్తో యిచ్చినావని తాగతన్నాను మావాం! అదేటో యీ పూరొగ్గేసి కొత్త నవుకిరీలో కుదురుకొన్న కాడినుంచి వోరయ్య నానొకటే తాగుముచ్చ నయిపోనానంటె నమ్ముతావుర! వోరి నాను తాగడానికి బుడ్డెత్తి నప్పుడల్లా యిసిత్తరంగ నీమాటలె యినిపించేవిర?! ఆ సారాకాయల మవ్వగు పించే వోడివిర! తెగ గింజుకునాడిపోయి సివరికి ఇసాకపత్తనానికి బదిలీ అయ్యే కాడికి నా ఆడవాయి మీ దొట్టేసుకు పూరాగా తాగుడొగ్గేసినానురా! ఇయ్యేలకి దాని వోసనకె యెలపరం వొచ్చినట్టయి పోతాదిర.... అయ్యేల కియ్యేల మల్లి యీ తీపికల్లు రుసి సూత్తన్నాను "అని పాయని కల్ల కద్దుకొని తాగుతూ "మనూరు జిల్లా అయినాదో నేదో నాదేస యిటు తిరిగిపోనాది. సానా కొకులడి యీ వూకుల యెల్తాపీచునోకొచ్చేసినాను... వొరె అందిలున్న మా ఆపీచరు మా గొప్పోడునే. యిసాకపత్తనంల వున్న ఆడి నేస్తగాల్లంతా వోరయ్య యేం సదువులుర ఆల్లవి! కూకున్న కాడినుంచి నెక్కుండ అనాగ్గాజు బుడ్డీల యేటేటో వోసుకొని సారాదీపం కాడెట్టీ దించీ అనాగటి దిక్కే సూత్తూ కాయితాల యేటోటో గిలుక్కుంటూ వుండిపోతార్ర. యియ్యేల కాల్లంత యీ వూరొచ్చి నారు. మా ఆపీచరూ ఆల్లూ కనగా పునగంగా కూకొని యీ తీపి కల్లంటే యేటో యిసిదం సేసుకొందావని మూడు సుట్టులు యేకాడినుంచో కల్లొట్టుకొచ్చి నాబం నేక యిసిక్కొంటున్నారుర. నానొకటో రకపుం వొట్టుకొత్తానని నీదగ్గరకు లగెత్తుకొచ్చినాను" అంటూ జేబులోంచి వో పదిరూపాయల నోటు తీసి పైడితల్లి చేతిలో కుక్కుతూ "ఆల్లిమ్మ నిచ్చింది - కాదనుకుర" అన్నాడు సీసాలకి మూతలు తీస్తూ.

"యెంత గురివుంచినావుర నామీద!. సానా మంచిపని సేసినావుర తాగుడాగ్గేసి! వొరె నా యాడంగిని వోపాలి సూసిపోవేటి-తెగ సంబరపడిపోతాది! సిటం వుండర మా బుడ్డోడొత్తాడు. నా కాలంవాడు నా నెట్టగుండేవోడిని అదిగనాగె అచ్చుమచ్చు గుంటడంటది మియ్యప్ప ఆడిని సూసినప్పదల్ల. సూసెద్దుగాని వుండరెహె" అంటూ కల్లుపోసిన సీసాల్ని పక్కకు పెట్టేడు సింహాచలం.

"నిదానంగా మల్లోసుట్టు నా యాడంగి నొట్టుకొత్తాను నేర. అల్లంతా నాకోసం కాసుక్కూకుంటరని తొందరగున్నదంతే. ఇక యీ వూరుల గదేటి మా కాపురవుఁ.... వొరె యెవుౖరా మొన్న యెనగాడ కొండకాడ సచ్చిపోనారు?! "అన్నాడు ఎరకయ్య లేవబోతూ మళ్ళా కూర్చొని".

"అల్లా పొలిమేరకాడ రంగులమేడ నేకర - అందులుండేవోడు బుౖర మీసాలెట్టుకొని! ఆడికొడుకు సానా సిన్నవయసే యేదో గొప్ప సదివే సదువుకొని ఆడి నేస్తుగల్లని వోటాదార్లుగెట్టుకొని కాకిముచ్చి పేౖటీ యెడదా వఁనుకొన్నాడు. కాకిముచ్చి దొరుకద్దో నేదో అని ఆతన్ని మచ్చకొండ కాడా ఈతన్ని యీకొండ సుట్టూరా తెగ యెతకతన్నారట ఇదిగింతలో వో వొఁడ లోకి యెల్లినారొ నేదో అంతె నోపల తొంగున్న యెలుగ్గొడ్డొచ్చి అక్కడకక్కడే యీకిని పీకి సంపేసినాదిర!"

"వొరె నాను సమ్మింది సెబతా నినుకొంటావుర?!- ఆడిబాబు ఆ మేడెలాకట్టినాడొ తెలుసా!- నా నింతున్నప్పుడుర ఆ నెల్లిమర్లేసు వూట గడ్డనోకి యెగదట్టు కొచ్చేసి నాడిటరా వోరయ్య ఆ సీళ్ళన్నీ పొంగుకొచ్చి ఈ మూడు కోనేర్ల జలవుఁతో ఏకవైౖపోనాయి. యీ పొలిమేరలన్నీ కొండ తట్టుదాకా యేకంగా జలమయవైౖపోనాయిర. వొందలమందికి జెనం సచ్చి పోన్నౖర....అదిగలాంటి సమయవుఁలో యీ మీసాలోడు లేసేడుపు అరువు తెచ్చుకు "మాయమ్మ సచ్చిపోనాదిరోయ్" అని అన్నేయంగా మాటపుట్టించి సెవాల మద్దిలొడి తిరిగినాడు ఏ సెవంముక్కూ సెవీ యిలవగుంటే ఆ పీనుగు మీదీడు ఇరునుకు వొడిపోయి "వోలమ్మో" అని రాగాలు తీత్తానే ఆ ముక్కూ సెవులకున్నవీ సేతులకున్నవీ వొల్సుకు మడిసేసినాక "వోరయ్యో యిది మా యమ్మ కాదురోయ్" అని మరో నదురుగున్న సెవం కాడికి



అగెత్తుకుపోయేవాడు!- యిదిగొ యీ నెక్కన అన్నేయంగ మడిసిన డబ్బుతో మేడకట్టినాడు. మరాడు యేవఁయిపోనాడనవేటిర?!- ఆ మద్దిల గుడ్డిల ఆడుండగ కలివిఁ గోల పంజాదెబ్బ కొట్టి దిక్కులేని సావు సంపినాది! ఇంకా అన్నేయం తీరనేదు --- యిప్పుడీ బుడ్డోడమాయకంగా యెలుగ్గొడ్డుకి బలయిపోనాడు.

అందరవైళ్ళిపోడం తప్పదు. బతికేటి బాపుకోవాల సెప్పు? వున్నన్నాల్లు నాయవుఁగ గుండె మీస్సెయ్యేసుకు బతకాల. అసెలుపెంచు కొన్నాడికీ, అన్నేయం గున్నోడికీ అదప్పతనవుఁ తప్పదుర. వొరె నానన్నదానికీ యిద్దరి సావులూ నిబద్దిగావేఁటిర?! దీన్నెంత సక్కంగ యిసిదంసేసినాడో యినకో—

"పస్పాని సేలపయి బాంతి వొడియున్నావు-
పుచ్చులొగ్గి యున్నారు సిలకా
పుచ్చాల వొడనేల! వూపిరీ వొగ్గనేల!—
ఆనందవుఁ మనకేల సిలకా"!

ఎరకయ్యలేచి "వోరి నీకు దన్నవుఁరా! నువ్వెప్పటి కొక్కనాగే వున్నావుర. నీయంత సూటిగెవుండగల్రా-యేటో నీ పిచ్చిగాని! యీ రోజుల అన్నేయానికి యెంత దూరవుఁ గుందామన్నా యీ లోకవెఁ వుండనీదుర సివ్వాఁసెలం! అయిన కాడికి సెయ్యొగ్గుకు పోవాల్నంతె అలాక్కానోడికి కూడేనేదు - మరిదెలాగరా?!..........వొరె పయిడి బాబింకా రానేదుగాని నానెల్లొత్తానుర - అకాడ ఆల్లు నాకోసం కాసుక్కూకుండిపోతారు'' అని సీసాల్ని సంచీలో పెట్టుకొని వెళ్ళిపోయేడు.

ఇంతట్లో పైడితల్లి వొక్క వుదుటున గబగబ వొచ్చి కావిట్లో వొకవైపు పదిలంగా పట్టుకు తెచ్చిన కుండపెంకుల్ని తంౖడికి కనిపించేలా వో చెట్టువార గుమ్మరిస్తూ అందుకున్నాడు— "యిల్లిదిగిటు సూడరయ్యా— నీ సత్తెకాలబ్బుద్ది కేటొరిగినాదొ! నట్టిలన్నీ యెనాగ బొక్కలెట్టేసి యిరక్కొట్టినారో సూసుకోరా! యిదిగిదంతా ఆ యిస్కూల్ల సదవు లెలగ బెట్టే ఆ పొలిమేర యీదులవున్న గుంట నాకొడుకులు సేత్తన్నపని ఆ కుౖరసచ్చినాల్ల నొట్టుకు సెట్టుకోడి సెప్పున తడపలెట్టి యిరిసికట్టెయ్యాల. అయినాక నేపాలం రువ్వలొట్టుకు తొక్కలొడిసెయ్యాల. అయ్యాల గ్గాని ఆల్ల తలకెక్కదాల్లేటి సేత్తన్నారో—నా

తడేకా యేటో! ఆ యాకల కంతనెక్కా వోనుట్టు నా తడాకా అంటేటో రసి సూపిత్తానానంటె నువ్వేయెనక తీత్తన్నావు ఈ నెక్కని నువ్వే ఆ పోకిరీ సచ్చినోల్లందరికీ అలుసిచ్చేసినావు" అని ఖాళీ కుండల్ని (గూనపెట్టి కావిడిని పక్కనపడేస్తూ మళ్ళా అందుకొన్నాడు. "వొరె బాబో నీకేటి పట్టనేదుర— నువ్వోల్లకుండ కూకో— నానాల్ల పని సూసుకుంటనింక!— ఇయ్యేల కారేడు. సుట్లయి యెన్ని సట్టీల్ని పగలగొట్టేసినారో— ఆతన్న పోగడున్న కుండ పెంకుల్ని సూడర— గుండె సెరువయి పోతాది! మనకేటి ఆ తట్టీలన్నీ వుత్తి పున్నేని కొత్తన్నాయేటిరయ్య! కుమ్మరి మారెమ్మ తట్టికో నలబయి పయిసా లెక్కన గుంజుకుంటున్నాది. యీ జరుగుబా టెనాగవుద్దో నువ్వెసెప్పర" అని వొచ్చిన యిద్దరి ముగ్గురికి కల్లు అమ్మి దూరంగా కూర్చున్నాడు.

"వోరయ్యా యెందుకనాగ నోరు సేసికొంటావు! అంతదురితం కూడమర— నిదానం గుండాలి మన గెలసారవుం వొక నెక్కనుండకె యియన్నీ యా రీతి గున్నాయి ఆల్లనని యేటి నాబం. మనం నోలాడేసికోడవే మిగినిపోతాది మన నోసటిల గీత బాగోనేదంతే" ఇలాతండ్రి అనీ అనగానే సర్రున లేచి నిల్చుని చేతులాడిస్తూ కొడుకందు కొన్నాడు—

"యేటోరయ్య అంతా మన గెలసారవూం గీతా అని కూకుంటే కుదురుతాదేటిర?! రేపీకాడికి కొత్త సట్టీల్నేకపోయినయ్యంటే మరి గీత పనెలా జరుగుద్దోరయ్యా? డబ్బోసు కొట్టుకొచ్చినా ఆ కొత్త తట్టిలన్నీ నీళ్ళలెంత నానెట్టినా సయిమని కల్లు సగానికి సగం నాగేత్తయి!— అనా ముదనట్టపోల్లందరికీ కల్లు నెత్తికొచ్చినాయిరయ్య! యీ కంతిరీ నా కొడుకులందరికీ సదువు లబ్బుతాయని నెలకింత సొప్పున సరకారోల్లు డబ్బులిత్తన్నారు ఆ డబ్బులు కరుసయ్యేదాకా మీసం రానిగుంట సచ్చినాడు కాడినుంచీ వోల్లు తిమ్మిరెక్కించు కోడవెం; డబ్బులయిపోనాక కుతితీరక యిది గినాగ రాల్లొట్టుకు తట్టిలకి సిల్లులెట్టి తాగడవం రివాజయి పోనాది.

"వోరాల్లకుండరేసి - దీనికి దానికి ముడెడతావేటిర! యేటి నీ కులపోల్లని సదువుకో వద్దన్నారేటి?! మద్దిల ఆ వూసెందుకు— ఆల్లేటి యీల్లని తాగి దందనా లాడమన్నారేటి. కుసింత వోరుసుకుండాల! యెదటోడు సిన్నొట్టుకు అన్నేయవుంగ కొట్టినా నువ్వు బరాయించుకు సాంతంగుండాల— అదిర మడిస



న్నవోడికి కావాల్న........ ఆల్లేటి వొట్టి కుర్రకుంకలు. అల్లనొట్టుకు తన్ని గలాటా యెట్టినావనుకో— నీకేటి వొరిగిపోతాదిర! ఆ గలాటా అదిగనాగ ముదిరి పోతాదంతె........నువ్వు యేరుపొద్దు లాల్లేటి సేసినా సాంతంగ వోరుసుకుండరా— ఆకాడినుంచీ ఆల్లు నీ జోలికొత్తారేటి సూడు! అదిగనాగ నీ మంసితనవెట్టుకొని యెదుటోడిని మంసోడిగ మారుసుకు రావాల్న........"

"యెల్లెల్లోరయ్య— యెల్లి ఆ మటంకాడో మంజిరంకాడో పొద్దుగూకులా యియన్నీ అందరినుకొనేట్టు సెప్పర నాకాడ కాదు!" అంటూ పైడితల్లి కావిడిలో కుండల్నీ ఇంకాకొంచెం కల్లున్న కడవనీ సర్దుకొని ఏత వీధివైపు బయల్దేరేడు.

సింహాచలం లేచి తన మెల్లో దోపిన నోట్లూ చిల్లరాతీసి కొడుక్కిచ్చి రెండు ఖాళీ తట్టిల్ని పట్టుకొని కొడుకు వెనకనేనడుస్తూ మెల్లిగా అందుకొన్నాడు—

"వొరె ఆసంగతింకొగ్గేసి - యిపుడు సెపతంది నానెందుకు సెపతన్నానో సెవినెట్టుకోరా!........వోరం రోజుల కాడినుంచీ నానుసూత్తన్నాను!.... ఆ తీపికల్లు సిటంలో యిక్కడ అమ్మకవై పోదేటిర— అదెందుకింటికెత్తి కెలతన్నావు? నాను నిదానించుకు చూసి నాకే నిన్ను నిగ్గదీసి అడుగుతున్నాను.— వొద్దుర అనాగ మురగబెట్టినాక నానాగడ్డీ కలిపి మురసరంగ అమ్మకుర— తాగినోల్ల కడుపులన్నీ దొలిసేత్తది. అందిల తాటికల్లు మురసంగున్నాదంటె కీల్లపట్టు లొగ్గేత్తాయిర— అయినాక వోతంకూడా కమ్మేసు కొత్తాదిర. యెదవ అనగా జెనం రంజుగులెటదనీ; సేసే బండ సాకిరీ తెలనియ్యదనీ; తిమ్మిరెక్కాయకట్టం మరిసి తొంగుటిడచ్చనీ— సెవటోడిసి తెచ్చుకొన్న డబ్బులన్నీ మనకోసి తెగతాగిపోతా్రర. అయినాక ఆ రికసా నాగేవోల్లూ కలాసీవోల్లూ కాల్ల పట్టులొగ్గేసి రికసాన్నాగలేక బరువులెత్తనేకా సేత్తొ కడుపు లొట్టుకు ఉమ్మసుట్టుకు పోతా్రరా....ఆల్లపెల్లాల పిల్లల వుసురెవరికిరా తగుల్తాది?!.... వొద్దుర నా మాటినుకో. కింకపట్టు వొగ్గేసి నాను సెప్పింది తలాయించకుండ ఆ కడవ ఉన్న కల్లు ఇదిగిల్లిక్కడె అమ్ముకింటికెల్లరా." అంటూ కొంచెం వేగంగా అడుగులేసి కొడుకు దారి కడ్డొచ్చేడు.

"అదేటి నేదునే! అడ్డునెగు.... నానేటి అమ్మన్నే!........యియ్యాల. నా సంగాతకాల్లొచ్చి సరదాగా బాలు సేసుకొందవన్నారు. ఆల్లకోసం వొట్టుం కెలతన్నాను.—" అన్నాడు తండ్రి మొహంలోకి చూడకుండా పక్కగా తప్పుకొని మెల్లిగా ముందడుగేస్తూ.

"నఫ్ యెదవా— నా కడుపున సెడబుట్టినావుర. అన్నేయం సేసింది సాలక బొంకులాడ తవుర . బొంకులు!?.... అకాడికి నాని దిగిప్పుడన్నదంత నాను పుట్టించినానంటావేటిర యెదవ నాకొడక! నాకేటో అనుమాన మొచ్చి మెదన కుండ నాలుగు రోజులు కాడి నుంచి పరకాయించుకు సూసుకొత్తన్నాను. ఆ పెంటయ్యగోడు సొయంగా నీకాడ మొన్న తాగొచ్చి నాకు సెప్పినాడు గాదేటి ఆడిని నానే అంపినాను. వొక్క సీసాకాయ తాగొచ్చే తలికె అడికి దిమ్మతిరిగిపోయి సుక్కలవుపింసి నాయిట?!... అకాడికీ నానెందుకేటని నిన్న మీయమ్మతో నీకు సెప్పించినాను....వోరి ఆ రిట్టకాయల పులుసూ, కల్లు తట్టి మడ్డీ, గెంజీ - ఇయన్నీ కలిపేసి ఆల్ల కడుపులు దొలిసేసి అల్ల పెల్లాల పిల్లల కడుపులు కొట్టి నువ్వు గుంజుకుంటున్న ఆడబ్బు రంగూ, యీనీ సేతిలో వున్న డబ్బురంగూ యేరీతిల్లో గుంటదో.......కల్లుంటే యిప్పుకు సూడరా అవుపిద్ది?!....సీ.......!అన్నాడు సింహాచలం మఠం తోవా యేతవీధి తోవా విడే చోట ఆగి.

"బజనకేలవుతున్నాదెద్దు.... నాకు నీకు సరిపడనేదునే! నాదారీ నీదారీ యిదిగినాగె యేరడిపోతన్నాయి........ నానింక యెల్లి పోతన్నాను" అన్నాడు పైడితల్లి నడుస్తూ.

సింహాచలం తక్కున అదోలా కొడుకుని చూసి ఏమనుకున్నాడో— కొడుకుని అనుసరిస్తూ వో రెండడుగులు వాడి దారిలోవేసి ఆగి—

"వోరోరి . అనాగనకూడదని యెన్నిసుట్లు సెప్పినాను - మల్లదిగనాగే అంటావేటి?!... "యెల్లొత్తాను" అన్లేవేటి?!......నాన్నమ్మకొన్న మాట నీకు సెప్పినాను గాని నానేటి సెట్టంతున్న నీకు సెప్పగల వోడినేటి?! యెల్లిరా— నీకేటైనా బాగనిపిత్తాదో అనాగెసెయ్యి!" అంటూ చేతుల్లో వున్న కుండల్ని



మెల్లిగా కావిట్లో సర్దేడు - కావిట్లోవున్న ఈత మొవ్వ తీసుకొని, వో ముక్క చిదిమి కొడుక్కిచ్చి మిగతాది పట్టుకొని మఠంవైపు తిరిగేడు.

ఏత వీధిలో వుండే ఏతవాళ్ళు సంవత్సరంలో నాలగైదు నెలలు గీత పనితోనూ; రెండు మూడు నెలలు తాటికమ్మ పనుల్తోనూ; మిగతా నెలల్లో ముంజెలూ, యీతపల్లూ, తేగలూ అమ్ముకొంటూనూ బ్రతుకుతారు. ఆడవాళ్ళు తడపలు తీయడం; తాటినార నుంచి యీనెలు తీయడం చేస్తుంటారు. ఈనెలని రోడ్లపై ఎండబెట్టి కట్టలు కట్టి; ఎందుకో ఎక్కడికో తమకే తెలీకుండా దళారీలకి అమ్ముకొంటారు. ఆ కట్టలు ఇటు బ్రష్ల తయారికీ మనదేశంలో ఎక్కడికో వెల్తున్నాయంటే నమ్మినా నమ్ముతారేమోగాని; కలకత్తా మద్రాసుల మీదుగా అటు జపాన్ లాంటి పైదేశాలకి అవి పోతున్నాయంటే వాళ్ళునమ్మనైనా నమ్మలేరు!

ఆనాటిరాత్రి అన్నం వొండుతున్న ఆదెమ్మ తన కొడుకు తెచ్చిన కల్లు తెచ్చినట్టే యింట్లో వుంచేయడాన్నీ; యింటిముందు నులక మంచం వేసుకు కూర్చొని కల్లుకొచ్చిన వాళ్ళందరికీ లేదనిచెప్పి పంపేస్తుండడాన్ని వోకంట కనిబెడుతోంది.

"మీ బాబుకీ రాతిరంతా బజనతోనే తెల్లారిపోతాది. నువ్వు నెగు—కూడు వుడుకెట్టేసినాది''—అంటూ ఆదెమ్మ వుడుకునీళ్ళ కుండనితెచ్చి గుమ్మం దగ్గిర పెట్టింది.

మళ్ళీ యింట్లోకి వెళ్ళి రాజుకుపోతున్న మంటని వీలైనంత తగ్గించడానికి ప్రయత్నిస్తూ పొయ్యిలో గోగుపుల్లల్ని దిగసన లాగి, వుడిసిలితో నీళ్ళని మంటపై చల్లి మరీ వొచ్చింది! లేచొచ్చి పైడితల్లి వొంటిపై వేణ్ణీళ్ళని చన్నీళ్ళతో తొరిపి డోకితో పోస్తూ ఆదెమ్మ—

"వోరయ్యా నానుగాని మీ బాబుగాని యింకెన్నాల్లుంటవోం సెప్పర! మా కింకయెవురున్నార్ర?!........మమ్మల్నింత బూడిస్సేసిందాకన్నా ఆ మున నోడి మాటకి కసింత సెల్లుబాటుండేనాగ మెదనకుండ నువు నడుసుకు పోకూడదేటిర!....మాటకాడ మాటాడుకుంటు మీ యిద్దరినాగ సజావుగుండకుంటె— నా నెందిల వొడిపోడవోం సెప్పు" అని అంది యేడుస్తూ.

"అదేటి మద్దిల నువ్వేడుసుకుంటూ వేటోలమ్మా!.......... ఒల్లకుండె హెయ్!.... నానేటి సేసినానొ సెప్పు నానాడి కొడుకును గాదేటి?! నాను తప్పు సేసినానని— ఆడుకాదు— వోలమ్మ నువ్వొప్పుకొన్నావంటె— యిగిగో దోకి క్రతో నన్నొట్టుకు సితకబాదె నానేటి నెపంవెట్టను! నానేటన్నాను యీ రోజుల కరుసు వూరికే సేంతాడు నాగా పెరిగిపోతన్నాది. ఆడన్నేయ వన్నేయమంటూ యినాక్కూకుంటే నీ సెవుల్దీ ముక్కుదీ వూడనాగి యెన్నాల్లీనెక్కని సరిపుచ్చు కుంటవోం సెప్పెహెయ్!

యింకేటున్నాది......మల్లొచ్చె వున్నాంకల్ల తేంటీగలు పట్లొగ్గేసి తాటి సెట్టెక్కి కూకుండిపోతాయి. యింకేటి మిగల్తాది! యీ సందిల ఆ పోకిరి సచ్చి నోల్లు ఆ పెండిల మొత్తం కాడికి వొక్క సెట్టుకి వొక్క సుక్కన్నా వొగ్గడవుం నేదు సరిగందా తట్టిల్కి తట్టిల్నే యిరక్కొట్టి పోతన్నారు. యీ నట్టంవంతా యేకాడికి వూడుసు కోడవోం వోలమ్మ నువ్వేసెప్పే నానినుకొని మెదనకుండ సజావు గుండిపోతాను!—" అంటూ వొళ్ళు చేతుల్తోనే వోడ్చుకుంటూ తుడుచు కొని, సీళ్ళకారే బుర్రని తల్లి కందించేడు. ఆదెమ్మ కొంగుతో తన తల తుడుస్తుంటే మళ్ళా అందుకొన్నాడు.

"యీ రోజుల యీడి తీపికల్లుని వొల్లు సల్లగుంచుద్దనీ; వొంటిని యినప కమిసీనాగ వుంచుద్దనీ యెవుడే తాగతన్నాడు?! మీసం మొలవనాడి కాడినుంచీ వొల్లు తిమ్మిరె కావాల! యియ్యాలీ కాడికి తాగితె రేపీకాడిదాకా నిసా గుండాల! పట్టొగ్గేసినాదా వోలమ్మ రేపాడు తాగడానికి నీకాడికొత్తదేటి?! యియ్యన్ని బాంబుంకేటి తెనుత్తాయినే! వోలమ్మ ఆడికి యీరబ్బమ్మంగోరి గీతాలు యిసిద వైంనట్టుగ యీ లోకరివాజు యిసిదం కాదునే!

మొన్నెల్లిన కావిటి పండక్కాడినుంచి యీరెన్నెల్ల - నానేటి మురసం గమ్మితె ఆడికెందుకు? నానాడి మాటని సరుకుసేయకుంటె నీకెందుకు?— నానమ్మగొచ్చిన డబ్బుతో ఆ అబ్కార యేలంపాట కొట్టుకొచ్చిన డబ్బంతా సయాంపయిసాతో సెల్లెట్టేసినాను. యింక మిగులుకొన్న డబ్బుల్తో మద్దేన,యేటి సేసినానొ... యెల్లి ఆగోర గూటిల నానెట్టిన పొట్నం యిప్పిసూసి కల్లకద్దు కొని మరీ సెప్పోలమ్మ నానెలాగ నడుసుకుపోవాల్నో...నా పనయి పోనాదినే! నానికమ్మన్నే!" అంటూ పైడితల్లి అన్నం తబుకు దగ్గిర కూర్చున్నాడు.



అన్నం తిన్నాక పైడితల్లి తన పెత్తండ్రి కొడుకైన నల్లమారిని పిలిచేడు. ఇద్దరూ కలిసి కడవలో మిగిలిన కల్లు తాగి; గుమ్మందగ్గిర నులక మంచం మీద కూర్చొని చుట్టని కాల్చుకొంటున్నారు. దూరంగా రైలు తెగ కూసి కూసి నిశ్చలంగావున్న కొండని కదిలించేస్తున్నట్లు ప్రతిధ్వనిస్తూ ఉదుటుగా పరుగుపెట్టి మరీపోయింది! రాత్రి పది దాటింది మసక మసక వెన్నెల. తుంచిన చిన్న తాటిమొవ్వ ముక్కలాగా వున్నాడు చంద్రుడు. ప్రశాంతంగా వుంది వాతావరణం. దూరంగా మఠంలోంచి తారస్థాయిలో లేచిన సింహాచలం గొంతుక గాలితో కొట్టుకొచ్చి లీలగా వినిపిస్తోంది.

"యెంతో కాలవుం బతికేనంటవు - యెపుడు పోతందోరన్నా
సంతకోట సంసారమిదియని;— "సతతవుం" అని నమ్మకురోరన్నా!
ఆనందవుంగ అమురుతంవుండే - ఆత్తంవ యెరుగర వోరన్నా
సాదులతో సంగతిసేసీ - సంది యెరుగుర వోరన్నా!"

వున్నట్టుండి దూరంగ కుక్కలు పెద్దగా మొరగడం వినిపించి పైడితల్లి రక్కున నల్లమారి భుజం పట్టుకు లాగేడు. వాళ్ళు కిత్తయ్య కోనేరుదాటి రైలుకట్ట దిగూకీ వెళ్ళేసరికే పెద్దగా కుర్రాళ్ళ కేకలూ ఈలలూ - వూరివైపు వినిపిస్తున్నాయి! పక్కనున్న నేపాళం చెట్లని పీకి రెండు రువ్వలు చేసి నల్లమారి కోటిచ్చి తానోటి పట్టుకుని పైడితల్లి వుదుటుగ పరుగుపెట్టేడు.

కీచురాళ్ళు చిమ్మెట్లూ చేసేగోల నరసయ్య కోనేటిలోని కప్పల గోలతో పోటీ పడుతోంది. మసకబారిన వెన్నెట్లో తాటిచెట్లు కొడిగట్టి ఆరిపోబోతున్న కాగడా కొయ్యిల్లా వున్నాయి! జీబుగావున్న పుంతల్లోంచీ అంచనాగా అలవాటుగా పరుగెట్టి వీళ్ళు నాటురోడ్డు చేరేసరికి గోల మాటుమణిగింది! నల్లమారిని వూరి వైపు వెళ్ళమని పైడితల్లి కొండవైపున్న పెండెల్లోకి వెళ్ళేడు. తాను కుండలు కట్టిన చెట్లపైకి కల్లు చికిలించి చూస్తూ వెళ్ళి వో చెట్టుకింద ఆగేడు. చెట్టుమీద కమ్మల్ని పక్కకితోస్తూ కుండల్ని సవరిస్తున్న శబ్దం స్పష్టంగా విన్పిస్తోంది. వీలైనంతగా వొంగి వొంగి మాను మొదట్లో గొంతికిల్లా కూర్చొని చెట్టు మొవ్వలో వున్న ఆకారాన్ని చూస్తున్నాడు. జుత్తు విరగబోసుకొని నిల్చున్న మొగ దెయ్యాల్లాగా తాటిచెట్లూ; ఆడదెయ్యాల్లాగ ఈతచెట్లూ పైడితల్లికి కన్పిస్తున్నాయి!

పున్నట్టుండి చెట్టుమీంచి దభీలుమని వో నల్లని పెద్ద ఆకారం పైడితల్లి మీద పడడం; పైడితల్లి పెద్ద చావుకేక వెయ్యడం వొక్కసారి జరిగేయి. నల్ల మారి వచ్చేటప్పటికి గుర్రు గుర్రుమని గురకపెడుతూ; ముట్టెని పైకీ కిందకీ తాటిస్తూ; అటూ ఇటూ తూలిపోతూ లేస్తూ కొండమీదికి పోతున్న ఎలుగుబంటి కనిపించింది. పెద్ద మూలుగుల్తో రక్తపు మడుగులో నేలకర్చుకుపోయి పైడితల్లి పడివున్నాడు.

శవ జాగరం భజనలతో తెల్లారిపోయింది. తల్లి ఆదెమ్మ శవానికి స్నానంచేయిస్తూ మరోసారి మొగతిరిగి గుమ్మంముందు పడిపోయింది. తిరిగి తెలివొచ్చేసరికి ఇంటిముందంతా ఖాళీ అవడంతో తమాయించుకొని ఇంట్లోకి వెళ్ళి గూట్లో రాత్రి విప్పిన పొట్లాన్నిచూసి తిరిగి కాగితంతో అలాగే ఉమ్మ చుట్టి పట్టుకొని ఎవరెంత వారించినా వినక శ్మశానానికి పరుగుపెట్టింది. భర్త తన జెబ్బలు పట్టివెనక్కి లాగుతుండగా బలంగా ముందుకువంగి కట్టెల మీదున్న కొడుకు నోటిని బలవంతంగా ఎడంచేసి, చేతిలోని పొట్లంలో బంగారు పిసర్లని వొంపేసి వెనక్కి భర్త చేతుల్లోకి వాలిపోయింది!

ఏనాడూ— కనీసం పెద్ద కొడుకు చచ్చిపోయినప్పుడు కూడా— ఏడవని సింహాచలం యేడుస్తూ కొడుకు తలకి కొరివిపెట్టి; అక్కడే అలా చితిదగ్గిర భగభగ రాజుకొస్తున్న జ్వాలలు తన మొహానికి తాకేలా లేస్తూంటే విల్చుని యెదురుగా చూస్తూ— "వోరి పైడిబాబూ - వొక్క నా కోసంవే నీకిట్టంనేకున్నా నాయాన్నొట్టుకుని ఆయిదైదులన్నా కల్ల సూడకుండా యెల్లిపోతన్నావురా! వొరె కొడుకా—నాయాన్నొట్టుకు నానేటి మిగులుసుకున్నానురా—వొయసు మిగులుసుకు వుండిపోనానుర పయిడితల్లీ!— యీ నాయాన్నొగ్గేసి మీకన్నా ముందుగన్నా పోయినాను గాదురా—" అని అంటుండగానే వొక్కసారి వొల్లూగిపోయి ముందుకు జోగిపోయేడు!

శ్మశానంలోంచి లేచిన పొగ— కొండమీద మేడను అంటుకొంటుందా అన్నట్టు పైకిపోతోంది! కాని, తాటిచెట్టంత ఎత్తుకు పోయేసరికే రూపుమాసి పోయి గాలిలో కలిసిపోయింది?!

—"భారతి", 1980 డిసెంబరు.



# (3) శంకుస్థాపన

"కొంపతీసి ఫౌండేషను ష్టోను అఁటెటో ఏయిస్తున్నామనుకొన్నా రేమిటి మేష్టారూ?" అన్నారు స్వింగ్ డోరు తోసుకొని ఆఫీసు రూంలోకి వొస్తూ సమితి ప్రెసిడెంట్ గరికయ్యగారు. అతన్తోబాటు ఊరి సర్పంచ్ తవిటయ్యా, బి. డి. ఓ.లు కూడా లోపలికొచ్చేరు.

ప్రిన్సిపాల్ చటుక్కున ఓసారి సీట్‌లోంచి లేచి కూర్చుంటూ "కూర్చోండి కూర్చోండి. అలా ఎలా అనుకుంటాను చెప్పండి! ఆపక్క హైస్కూలు గదులూ, ఈ పక్కన కాలేజి షెడ్డులు; ముందువైపు గేటూ, వాలీబాల్ కోర్టులూను! ఇప్పటికే కన్జెస్టడ్‌గా వుండగా ఎలా కుదురుతుందనుకొంటాను! అయితే...." అని ఇంకా ఏదో అనబోతుండగానే తవిటయ్య అందుకొన్నాడు—

"అయితే గియితే అంటారేటి మేష్టారూ? నానెంత నిదానించి సెప్పినా మీకేటి ఇసిదం కానట్టున్నాది! నేకపోతే యేటిసెప్పండి— యెల్లుండీ కాడికల్లా మినిష్టరు షారొచ్చేత్తుంటే ఇయ్యేలదాకా నాను మీకు సెప్పిన వొక్క అరేంజ్మెంటు కూడా కంప్లీటు కానేదు"

ఇంతట్లోనే గరికయ్య అందుకొన్నాడు— "అసలు మీరెందుకు సందేహిస్తున్నారో నాకేం తెలీడంలేదు. మేమే పీకించేద్దుం దాని పాక. అయితే ఇదిగో ఈ తవిటయ్యమీద ఇప్పటికే లేనిపోని నాన్సెన్స్ ప్రోపగండా వుంది. ఇప్పుడు గాని మేం డైరెక్టుగా రంగంలోకి దిగితే లేనిపోని సెడ్డపేరు కొనితెచ్చుకున్నట్టవుతాది. అందుకని మీకు పురమాయించేను. అయితే మేమంతా మీకు ఎనక సపోర్టుగా వున్నట్టే కదా!"

ఇంతట్లో బి. డి. ఓ కలగజేసుకుంటూ— "అంకాలు దగ్గిర ఈ సరౌండింగ్స్‌లో గుడిసె కట్టుకోడానికి పెర్మిషన్ గ్రాంటుచేస్తూ మేనేజిమెంట్ ఇచ్చిన ఆర్డరు ఉంటుంది కదా! అది చూపించి గొడవ చేస్తుందని ప్రిన్సిపాల్ గారు జంకుతున్నారేమో!" అన్నారు!

"ఆర్డరా! పాడా? అదేటినేదు. ఆ మాటకొస్తే ఆ యెదవ నంజకి హక్కే నేదు. దాని మొగుడిని నైటోచరుగ యేసినపుడు యేదో పుత్తి పున్నేనికని "వో గుడిసేసుకోరా!" అని నోటి మాటిచ్చినాం. అంతే మరేటినేదు. ఆడు పచ్చినాక ఆ యేకిన్నితో తలుపులుగాడిని యేసినాం. ఆడు వూర్లో పెళ్ళాం కొంపకాడే నివాసం యెట్టుకొని, రాతిరేల వరండామీద తొంగొని గస్తీ కాస్తండు. దాని మొగుడు సచ్చిన్నాడే యీ దొంగనంజని తగిలేసినాం కాదు, ఏటో పుత్తిపున్నేనికని—గరికయ్యగారు ఆళ్ళమాటా ఈళ్ళమాటా కాదన్నేక దీనికి సీపరు పోస్టోటి యిచ్చేసినారు ఇయ్యేల కానంజకూతురు కొదమకోసం కొట్టిన గుంజనాగా యిక్కడ పాతుకుపోయి కదల్ననదేటి?" అని తవిటయ్య అంకాలుపై తనకున్న అక్కసంతా వొక్కసారి కక్కేసరికి గరికయ్య—

"నీకీ మాటతీరూ పోర్పూ ఎప్పుడు తగ్గితే అప్పటిగ్గాని రైజ్‌లోకి రావనుకో! ప్రాణం తీస్తున్నానరే అలా బూతుల్తో తిట్టచ్చా— అందులోనూ సర్పంచివి, నోటి దురుసుతనం తగ్గించుకోవద్దూ''అని, ప్రిన్సిపాల్ వైపు తిరిగి- "అప్పుడేదో అయింది ఏదో పిల్లల్దిగదా అని వూరుకొన్నాం. ఇప్పుడు దానీ కూతురు పెళ్లై ఈ వూర్లోనే కాపురం చేస్తోందిటఁ దూ! అక్కడికి పొమ్మనండి! అదెక్కడికిపోతే మనకేటిగాని— ఇవాళ సాయంత్రంకల్లా ఇసక లారీలూ, ఇటికలూ, సిమ్మెంటూ— మొత్తం కంప్లీటుగా వొచ్చి పడిపోతాయి. రాత్రికి రాత్రి పనన్నీ అయిపోవాలంతే. అంచేత అప్పటికి సైటంతా క్లీన్‌గా చదునుగా వుండి తీరాలి— ఇక ఆ వర్క్ గురించి ఆపి, ప్రెస్‌వర్కు గురించి చూద్దాం. మరి సన్మానపత్రం నేను సెప్పినట్టల్లా రాసిపెట్టేరా? ఆ పజ్యాలు రాయించేరా? రేపు పొద్దున్న పదింటికల్లా టౌనులో ప్రెస్‌కి అవన్నీ వెళ్ళిపోతేగాని వీల్లేదు— ఇంకా చాలా చాలా తంతుంది" అంటూ సిగరెట్ వెలిగించేడు.

"అవన్నీ రడీగానే వున్నాయి" అంటూ ప్రిన్సిపాల్ డ్రాయరు సొరుగు లోంచి ఓ ఫైల్‌తీసి గరికయ్య కందిస్తూ "స్టాఫ్‌లో కొందరు అంకాలు వైపు మొగ్గుతారు. మరి వాళ్ళని నేను కొంచెం కాసుకోవాలికదా— అందుకనే కొంచెం ఆలస్యమైంది. ఇవాళ సాయంత్రం నాలుగ్గంటలకల్లా వెకేట్ చేసి వెళ్ళిపోతుంది" అన్నారు పేపరు వెయిట్‌ని యాదాలాపంగా అటూ ఇటూ దొర్లిస్తూ.



ఫైల్లో కాయితాల్ని అటూ ఇటూ తిరగేస్తూ గరికయ్య "ఈ పజ్యాల సంగతి నాకేటి తెలుస్తాదిగాని—చూడండి ఈ సన్మానపత్రం నేను చెప్పినట్టు అస్సలు మీరు రాయలేదు! నేనొక్కణ్ణేనా? అటు ఎం. ఎల్ ఎ. గారూ, ఇటు సబ్ కలెక్టరుగారూ కూర్చున్నాకే అనుకున్నాం. ఆ మాటలే మీకు రాసిచ్చేను. అసలు మేటరెలా వుండాలో చెప్పేను అసలా మాటలు గాని, మేటరు గాని వుంటేనా ఇందులో!—ఇవన్నీ ఏవిటండీ? అసలు మొదటిలైన్లోనే శంకుస్థాపన అని రాసేసారేంటండీ మరీనూ! కాకి వొత్తుండదుటండీ! అది దిద్దేయండి. మరి అదేదో సెంద్ర సిలా ఫలకం అని రాసిచ్చాను కదండీ. మీరేమో సలవరాతి పలక అని రాసేరు!— నేనేమై పోవాలో చెప్పండి. ఔను ఇదేవిటిది? బిల్డింగు కావాలనీ, లెక్చరర్లు సరిపోరని ఎవరు రాయమన్నారు సెప్పండి! అసలు నా ప్లాన్ మీకు భోధేపడలేదు మేష్టారూ! నేను సెప్పిందేవిటి - సీనియర్ కాలేజీకి అప్రూ సేయించమని మనివి సేయాలని! ముందస్తుగా జరగాల్సిందదీ. అదంటూ జరిగినాక - ఇంకేవుంది ఆటోమేటిక్కుగా మీరిప్పుడు రాసినవన్నీ మనం మనవి సేయకుండానే పైసలా అయిపోతాయన్నమాట! ఇక ఇయన్నీ యెందుకు రాయడం? తీసేయండి నేను చెప్పినట్టే కంప్లీటుగా మార్చేసి రాతిరి పదేలోగా నాకు అంపేయండి''అన్నారు.

ఈ మాటలకి చెమట పట్టే స్థితికొచ్చిన ప్రిన్సిపాల్ "మరేంలేదు— నాకు ఇంగ్లీషులో చెయ్యి తిరిగినట్లు తెలుగులో తిరగదు. అందుకని తెలుగు లెక్చరర్‌ని వ్రాయమన్నాను. అవన్నీ సరిదిద్దించి మీకు ఆరోగంట అయేసరికల్లా పంపించేస్తాను''అన్నారు.

"మరి నేను వెళ్ళి మిగతా పనులు చూసుకొంటాను. రేపీపాటికి ఆరు నూరైనా నూరారైనా సరే అంతా రడీగా వుండాలి. మీ హెల్పూ కోపరేషనూ లేకపోతే మేమేమీ చేయలేం మేష్టారూ! మరి వెళ్దామా! "అని మిగతా వాళ్ళ వైపు చూసేడు గరికయ్య.

"చూడండి - మరి ఇప్పుడు వేయిస్తున్న వైట్ వాషింగ్ మొత్తం బిల్డింగ్ అంతకీ కదండీ" అన్నారు ప్రిన్సిపాల్ గరికయ్యనీ తవిటయ్యనీ కలిపి చూస్తూ.

"ఇప్పుడెక్కడౌతుందండీ! ఏదో పనిలో పనిగా కాలేజీకి కంప్లీటుగా

సున్నాలు వేయిస్తే బాగానే వుంటుందనుకోండి కానీ ఎక్కడికని? ఇప్పటికే వోవరెష్టిమేషనై పోయి కూచుంది. ఈ పని అయేసరికల్లా ఎలాలేదన్నా మూడు వేల పై చిలుకుమాటే! ఎంతకని తేడం - ఎవర్నడిగితేడం? పోనీ ఏ అక్కౌంటులోనో గొలికిద్దామంటే కొంపలంటుకుపోతాయి అసలే రోజులేం బాగు లేవు. ఏదో కానిద్దురూ - ముందు కనిపించే గోడలికి వేసేరుకదా! అయినా మినిష్టరుగారు మేం చెప్పినట్టల్లా నడుచుకు పోవలసిందే! తెలిసిందా మేష్టారూ!" అని వోమారు గరికయ్య అందరి మొహాల్లోకీ చూసి, సంతృప్తిగా చిరునవ్వు నవ్వి లేస్తూ "అంచేత మేష్టారూ - ఇప్పటికిలా కానీయండి నిదానంగా దరిమిలా చూసుకుందాం. మరి మేంవొస్తాం మేష్టారూ" అంటూ లేచేడు. అతనితో మిగతా ఇద్దరూ కూడా లేచి వెళ్ళారు

అవతల జీప్‌స్టార్ట్ అయిన శబ్దం వినిపించగానే ప్రిన్సిపాల్ అటెండరు చేత తెలుగు లెక్చరర్‌ని పిలిపించి "ఏవిటి మేష్టారూ మరీ అంత శ్రద్ధ తీసుకోకుండా వ్రాస్తే ఎలా చెప్పండీ?— శంఖుస్థాపన అని వ్రాయాలి కదండీ. మీరా పదాన్ని వాడిన రెండుచోట్లా మామూలు కాయే వ్రాసేరు! మీరు స్టాఫ్‌నీ, ఎకామిడేషన్‌నీ ఇన్‌క్రీజ్ చేయమంటూ రాసేరు. బాగానే వుందనుకోండి. కాని ఆవిషయాల మీద గరికయ్యగారికీ వాళ్ళకీ ఏంఇంటరెస్ట్ అస్సలు లేదు. అంచేత కొంచెం అది డ్రాప్ చేసి, సీనియర్ కాలేజీకి పెర్మిషన్ గ్రాంట్ చేయమనే మేటరుపై ఫోకస్‌చేస్తూ వ్రాసేద్దురూ. అన్నట్టు అసలు సంగతి మర్చిపోయేను- చూడండి - వాళ్ళు చలవరాతి పలక అని కాక చంద్రశిలాఫలకం అనే పదాన్నే వాడమంటున్నారు ఈ క్లారిఫికేషన్స్ చేసి మీరు కాలేజీ వదలివెళ్ళేలోగా నాకీ కాగితాలిచ్చేయండి" అంటూ ఫైల్‌లోంచి కాయితాలు తీసి అతనికిచ్చేరు.

కాయితాల్ని తను అందుకొనీ అందుకోవడంతో ఇష్టం వొచ్చినట్లు చింపి లుమ్మచుట్టి వేస్ట్ బకెట్‌లోకి గిరాటేస్తూ——

"సారీ కాస్తంత బుద్ధి గడ్డితిని ఏదో మీరు చెప్పేరని - కేవలం మీ మీద వున్న రిగార్డ్‌కొద్దీ జీవితంలో ఏనాడూ రాయని ఈరాతలకు సిద్ధపడ్డాను. క్షమించండి - నాకు చేతకాదు. ఆ పద్యాలు వ్రాయించేరుగా వాళ్ళెవరినో వ్రాయమనండి - వొస్తాను" అంటూ లేవబోతున్న తెలుగు లెక్చరర్ ప్రవర్తనకి షాక్ తిన్న ప్రిన్సిపాల్ సర్దుకొంటూ——



"కూర్చోండి వెంకట్రామయ్యగారు! మిమ్మల్ని ఏదో అవమానించాననుకోకండి! అయినా ఇందులో ఏముంది - ఏదో వాళ్ళన్నట్లుగా రాసిచ్చేస్తే సరిపోతుంది గదా! వాళ్ళకేం తెలీకపోవచ్చు ఐతే వాళ్ళకి నచ్చజెప్పేకన్నా అలా రాసిచ్చేస్తేనే సరిపోతుందిగదా - అలా రాసిచ్చేద్దురూ" అన్నారు.

"నన్ను మీరు రాయమన్నారు - నాకు తోచిందీ; కాలేజీ అభివృద్ధికి ముఖ్యావసరమని నాకు అనిపించిందీ కేవలం మీ మాట తీసేయలేక వ్రాసేను. దాంట్లో మేటరు మీకిష్టం లేదని, వర్డింగ్ బాగోలేదనీ మీరే అంటూ ఇంకా అవమానించలేదంటారేమిటి?! - ఇక్కడ ఈ విద్యా సంస్థలోని ఒక వ్యక్తి రాతని ఈ ఇన్‌స్టిట్యూషన్ అభివృద్ధిని మనసారా కోరి రాసిన రాతని ఎవడో కాన్‌కిస్కా మీ ఎదురుగ పెన్ను పుచ్చుకు అండర్‌లైన్ చేసి మరీ మార్చేయమంటాడా? పోనీ నిజంగా ఏదో పొరబాటు దొర్లితే నేను శిరసావహిస్తాను. ఆ మిడిమిడి జ్ఞానం వాళ్ళకి తెలీపోడం వింతకాదు - కనీసం మీరన్నా ఈ సంగతి గుర్తించి ప్రవర్తించకపోవడం నిజంగా నా రాత! సారీ - నేను వ్రాయను" అంటూ వెంకట్రామయ్య ఛట్టున లేచేరు.

"వొక్కసారి మీరెవర్ని కాన్‌కిస్కా అన్నారో గుర్తిస్తే మంచిదేమో!?

ఏం బెదిరిస్తున్నారా! ఎవడైతే నాకేం!- నన్నవసరంగా వేదెక్కించకండి వెళ్ళిపోయేముందు వో మూడు వాక్యాలంటున్నా వినండి ఇవేవీ ఆ కాన్‌కిస్కా అన్నదానికి ఏదో అయి రుజువు చేసుకోడానికి అనుకొనేరు కేవలం మీకోసమే చెప్తున్నా - శంకువు అంటే మంత్ర యుక్తంగా పునాదిలో తొలిగా స్థాపించే వో చిన్న కఱ్ఱ! అంతేగాని శంఖమూ కాదు మరోటీకాదు. ఇక - చంద్రశిలాఫలకం ఏమిటి వాళ్ళ పిండాకూడు! స్పష్టంగా అందరికీ అర్థమయ్యేలా అందరూ వాడేమాట రాస్తే ఏం చిన్నతనంగా వుందా? ఏం ఇంతగా సంస్కృతపదంలో నిండుతనాన్ని చూసిన మొహాలేనా అలా ప్రయోగశాల అన్నదానికి అండర్లైన్ చేసింది? ఏం అందరూ వాడే సంస్కృతపదంకన్నా లేబరేటరీ హాల్ అనే పదమే డిగ్నిఫైడ్‌గా వుందిగాబోలు! ఇలా అఘోరించే వాళ్లుండబట్టె 'మాకు ఇంగ్లీషే నయం— తెలుగొద్దు అనేవాళ్ళు తయారౌతున్నారు. ఇక ఆ మూడో సంగతి - మేటర్ గురించి! దానిగురించి మీకు ఇప్పుడు ఎలాచెప్పినా అర్థంకాదు కాలంలో మీకే తెలుస్తుంది." అంటూ వెంకట్రామయ్యగారు వెళ్ళిపోయేరు.

అవాళ రాత్రి వెంకట్రామయ్యగారు భోంచేసి పేపరు తిరగేస్తుంటే అంకాలు మనవడిని బుజాన వేసుకు వొచ్చింది.

"ఏం అంకాలూ ఇలా వొచ్చేవ్! అన్నం తిన్నావా లేదా? ఏవిటి నీ యజమాని పేరింటిగాడనేమిటి భుజానవేసుకు మనుమడిని వొదలవు ఆం కూతురింట్లోకి మకాం మార్చేవట!"

"మరేకాడికి పోతాను సెప్పండి బాబూ! పెదబాబుగోరూ, పెసిడెంట్ బాబూ వొకరేటి అంతా కుమ్మక్కైపోనారండి నా కొంప పీకేసి నన్నీది నొడేసి నారండి. నానే కాడిక పోతానండి! ... ఆడెల్లే యెల్లిపోనాడు, నాకీ కొంకులొట్టు కున్నాయండి. మీరూ ఆచేరిబాబూ నన్నేటి బగవంతున్నాగా కనికరించినారండి. నన్నెనకేసుకొచ్చి ఆళ్ళకీ యీళ్ళకీ యినుకొనేట్టు సేసి నాకీ నవుకురీ యేయించి నారు. ఏటి మీరిద్దరూ యెనకేసుకురాపోతే నానేటి - నా అమ్మి వో అయ్యకాడి కెల్లడం కల్ల సూత్తా నేటండి! నిజేనికి మీరే దాన్నోయింటిదాన్ని సేసినారండి. ఈ సర్పంజిగాడో పింజారీయెదవండి నా ఒంటిమీద కన్నేసి యెంతేడిపించి నాడండి, అడికి నొంగనేదని కడుపులో యెట్టేసుకు నా నవుకిరీ వూడగొట్ట సూణ్ణేమటండీ యేదో అయిపోనాది. నా బుడ్డోడూ నానూ గుడిసెలో కూకుని కుసింత గంజి తాగుతున్నాం గందా అని నానెంతో మురిసిపోతన్నానండి. ఈ కాడికీ పింజారీవోడికీ బుద్ధి పుట్టినాది. వుత్త కంత్రీనాకొడుకండీ నానుగాని నాబొట్టిగాని అడికి నొంగనేదనే కడుపులో యెట్టేసుకు పెదబాబుగోరికి యేటేటో సెప్పేసినాడు గుడిసొగ్గేదాకా తెగ గింజుకు సచ్చిపోనాడండి - నా వుసురు తగల్దేటి"- ఏడుస్తూ అంకాలేదో గొణుగుతోంది.

"ఊరుకో ఏడిస్తే ఏం వొస్తుంది చెప్పు! అంతమంది కలిసి నిన్ను గెంటేస్తే ఏం చేయగలవులే! అవునుగానీ నీ మొగుడికి నైట్‌వాచర్ గిరీ వచ్చి నప్పుడు కాలేజీ జాగాలోనే ఇల్లు కట్టుకోనివ్వుటూ ఉద్యోగం చేయమని కాయితం ఇవ్వలేదుటే వాళ్ళు!" అన్నారు వెంకట్రామయ్య.

"నేదండి - నానెంతో సెవిసిల్లు కట్టుకు అలా కాయితం పుట్టించుకోరా అని తెగ సెప్పినానండి. ఆడేటి యినుకొనే రకమేటండి - యియ్యాల కదే నా కొంప తీసినాదండి. యేటి సేత్తరో మీరూ ఆసేరిగోరూ పూనుకోవాల.



ఆళ్ళంతా యినుకొనేటట్టు సెప్పి మల్లా నాగూడు నాకు నిలబెట్టాల - కానీజీకి యెనక తట్టైనా నాకేటి యిరకాటకవూం యిబ్బందీ నేవండి. ఏదో ఆ కాడికే యింత కమ్మనేసుకు పడుంటాను."

"నీ తెలివి తెల్లారినట్టే వుంది. కాలేజీకి వెనకాతలా అంటే రేపొద్దున్న గొడౌన్ కట్టబోయేచోట! పంచాయతీ జాగాలో నీకు చోటిస్తాడే సర్పంచ్! ఇచ్చినా ఆ ఆరుబయట ఎక్కడా కనుచూపు మేరలో ఓ గుడిసైనా కనిపించనిచోట నువ్వెలా ఉంటావే?- ఏదో సైన్సుమేష్టారితోబాటు ఆలోచించి చెప్తాను - అన్నం తిన్నావా?"

"మా అల్లుడింకా డూటీనోంచి రానేదండి. ఆడొచ్చినాక యెంగిలి పడదావని యీ బుడ్డోణ్ణి సంకనేసుకు మీకియన్నీ ఇనిదం సేసికోందామని వో సుట్టు పారొచ్చినానండి. సానా సేపైపోనాది - బేగెల్లకుంటే నాకేటి అగుపడద్దేటి! మరి నానెల్లిపోతానండీ అని మనవణ్ణి ఎత్తుకుంది.

"మంచిది - జాగ్రత్తగా చూసుకుంటూ వెళ్ళు. రేపు ఏ సంగతీ చెప్తాను. వో సారి కనిపించు" అంటూ వెంకట్రామయ్యగారు లేచేరు.

మర్నాడు వెంకట్రామయ్య కాలేజీకి వెళ్ళేసరికి అక్కడంతా మహా సందడిగా ఉంది లారీలతో ఇసక తెచ్చి వేసేరు!- "అవునుగాని సంవత్సరం క్రితంనుంచి ఆ ప్లే గ్రౌండులోనూ, వాలీబాల్ కోర్టులోనూ పోయించండయ్యా అంటే ఒక్కడు పులికితే ఒట్టు! మరి ఇప్పుడు - ష్స్!"- డి.డి టి బస్తాలు వో రెండు మూల రెడీగా వున్నాయి! "ఈ పౌడరుని న్యాయంగా ప్రతీరోజూ రోడ్ల కిరుప్రక్కలా కాలవలవైపు జల్లాలి గాబోలు! ఏదో ఇవాల్టికన్నా ఈ వూర్లో వో రోడ్డుకైనా ఆ యోగం దక్కింది!"- బిల్డింగ్‌కి ఇటువైపంతా సున్నం వేసేసారు లారీమీద వచ్చిన షామియానాలని, టార్పాలిన్‌లనీ, కుర్చీలని వరండా మీదకు దింపి వోగదిలో పేరుస్తున్నారు. స్టూడెంట్స్ కొంతమంది బ్యానర్లపై యేవో అక్షరాలు రాస్తుంటే; మరికొంతమంది రంగు కాయితాల్ని కత్తిరిస్తున్నారు. గేటుదగ్గరనుంచి త్రోవకటూ ఇటూ ఇటుకల్ని కోసుగ కొట్టి పాతుతూ, వాటిపై తెల్లగ సున్నం వేస్తున్నారు.

వెంకట్రామయ్యగారు చటుక్కున దూరంగా కుడివైపు ప్రహరీవారకి చూసేరు. అసలు గుడిసె వున్న పోలికే లేకుండా నేలంతా చదును చేసి "ఎల్" షేపులో గొయ్యి తవ్వి మొదట్లో గోతిలోకి మూడుమెట్లు చెక్కుతున్నారు. దానికి కొంచెం దూరంగా— "అరీ! ఏమిటప్పుడే దిమ్మ కట్టేయడం; దానికి అక్షరాలు చెక్కిన చలవరాతి పలకని తాపడం కూడా అయిపోయింది!— నిజంగా అవసరం అని అనుకోవాలేగాని— అనుకొన్నారా ఎంతపనైనా వీళ్ళు అవలీలగా చేయగలరు ఈ శ్రద్ధలో పావువంతు శ్రద్ధ చూపినా ఈ కాలేజీ ఈ పాటికెంత అభివృద్ధి చెంది ఉండేదో!"అని అనుకుంటున్న వెంకట్రామయ్యగారి దగ్గరికి—

"నమస్కారం మేష్టారూ! ఓచిన్న శుభవార్త! ఇవాళా రేపూ మన ముష్కరుడుగారు కాలేజిలో వర్క్ సస్పెండు చేసాడు రేపటి ప్రోగ్రాం సర్క్యులేట్ అవుతోంది ఫుల్ సిగ్నేచర్లు కోడుతూ!" అంటూ సైన్స్ లెక్చరర్ భాస్కరాచారి వచ్చేరు.

"అయ్యో ఇవాళ మంచి పొయిట్రీ క్లాసులు యేట్లో కలిశాయన్నమాటే"

"ఎందుకండీ మరీ అంత వర్రీ అయిపోతారు?— మీరంటుంటారు చూడండి 'తామరాకుపై నీటిబొట్టు లాగ అని'— ఆమెంటాలిటీ ఈ విషయంలో కూడా అలవాటు చేసుకొకబోతే బ్రతకలేమండి! మీరేమనుకోండి— నా మటుకు నాకు హాయిగా తేలిగ్గా వుందివాళ! పదండి ఓ మారలా హాయిగా యేటి ఇసుక లోంచి నడుచుకొంటూ అట్నుంచి రామతీర్థాలు జంక్షన్‌లో సిటీబస్‌నీ క్రాస్ చేసి విజయనగరం పోదాము. ఇవాళ సిడ్నీపోయిటర్ టీచరుగా ఏక్ట్‌చేసిన "సెర్వ్ విత్ లవ్'' అన్న బ్రహ్మాండమైన పిక్చర్ వుంది. సిటీలో" అన్న భాస్కరాచారి మాటలు విని వెంకట్రామయ్యగారు-

"సారీ— ఇవాళ వో చిన్న రాతపని పైనేసుకున్నాను'' అన్నారు.

"ఐసీ— మళ్ళా ఏదైనా ఆర్టికల్ రాస్తున్నారా!!"

"లేదండీ— చిన్న లోకోపకారం - అవునుగాని - వోసారి ఇలారండి" అంటూ వాలీబాల్ కోర్టువైపు నడుస్తూ వెంకట్రామయ్యగారు "అవును లేబరేటరీ అక్కడ కట్టడమేవిటండీ? కాస్తీ ఎక్విప్‌మెంటు ఉంటుంది కదా! గోడకటువైపంతా ఆరుబయలుంది!" అన్నారు.



"ఏమిటి మాష్టారూ మీరు మరీ అంత ఇన్నోసెంట్‌గా ఎలా ఉంటారో అర్థం కావడంలేదు— అంతా ఫార్సండీ! గరికయ్య మొన్న ఖాళీ అయిన రిజర్వ్‌డు సీట్‌పై ఎమ్. ఎల్. ఏ.గా నించోబోతున్నాడు లెండి. ఆ సీట్ గ్యారంటీగా తనకే దక్కాలని, తీరా అది దక్కేక ఖర్చులకై వీలైనంత ఎక్కువగ పార్టీ నిధి నుంచీ దక్కించుకోవాలనీ, ఇక ఆపైన గెలిచేక - శాంతం పాపం— అయినా చెప్పుకోక తప్పదు— ఏ పోర్ట్‌ఫోలియోలోనో ఇరుక్కుపోవాలని బ్రహ్మాండమైన ఆశాపాశాన్ని తన మెడలోని శుద్ధ పొందూరు ఖాదీ వోణీలాగ అందంగా పెంచుకుంటున్నాడు. అందుకోసమనే ప్రస్తుతం రాబోయే మినిష్టరుగారి హార్ధిక లేక ఆర్థిక సహాయసంపత్తులు పొందాలని ఇలా సదరు శ్రీవారిచే ఇక్కడ ఈ శంకుస్థాపనా, అక్కడ ఊరి పొలిమేరలో ఎప్పటినుంచో వాడబడుతున్న హరిజనవాడలో కొన్ని యిళ్ళకు ఓపెనింగ్ సెలిబ్రేషనూ, ఈ ఊరివారి మన ప్రియతమ శిష్యబృందంచే శ్రమదానంతో నిర్మింపబడ్డ రెండుంబావు మీటర్ల సుదీర్ఘ గోచీపాత పాత పంథాకు నూత్న ప్రారంభోత్సవమూ దగ్గరుండి చేయిస్తూ కాకా కొడ్తున్నాడు.

నందట్లో సందడిగా మన సర్పంచ్ ఈ కాలేజీని అమాంతం సీనియర్ కాలేజి చేయించేసి ప్రస్తుత గ్రాంట్లని డొనేషన్లని ద్విగుణీకృతం చేసుకు పదిలం చేసుకోవాలని యమయాతన పడుతున్నాడు. ఇక మన ముష్కరుడుగారు— పాపం వెఱ్ఱి వాడండీ— కొన్ని విషయాల్లో అతడ్ని చూస్తే జాలేస్తుంది—ముందా వాడు హైస్కూలులో మేథ్స్ అసిస్టెంట్‌గా అఘోరిస్తూ మెల్లిగ ఈ గరికయ్యని కరిగించుకొని ఈ పదవి నధిష్టించాడు మన ఖర్మ కొద్దీ! పాపం మేథ్స్‌వాడుగా— లెక్కలూ, తన జేబులో పడాల్సిన లెక్కలూ తప్ప పోలిటిక్స్ అర్థంకావు పాపం! నేనే జాలివేసి నిన్న చెప్పేను. "ఇదిలా జూనియర్ కాలేజిగా ఉంటేనే నీకా గాడ్రేజ్ సింహాసనం! సీనియర్ కాలేజీ అయిందా - చూచుకో ఈ త్రిశంకు స్వర్గం నుంచి జారి మీరూ నేనూ కలిసే డిపార్ట్‌మెంట్‌లో కూర్చోవచ్చు" అని! ఆమాట విన్నప్పటినుంచీ మేజోళ్ళు తేళ్ళు కుడుతున్నట్లు ఒకటే యాతన పడతాడే తప్ప పైకి పిసరంత కక్కడు! అమ్మో —గరికయ్యంటే గురుపుగారికి నరనరాల్లోంచీ ఎంతవణుకని! సారీ!—వస్తానండి మేట్నీకి టైమైపోతుంది - రేపు కలుద్దాం" అంటూ భాస్కరాచారి వెళ్ళిపోయేడు.

అవాళ రాత్రి ఇంటికొచ్చిన అంకాలికి వోకాగితాన్నిస్తూ వెంకటామయ్య గారు "ఈ కాగితాన్ని సైన్స్ లెక్చరర్‌గారికి చూపించి; జాగ్రత్తగా చదవ మన్నాననని, ఏమన్నా మార్పులూ చేర్పులూ వుంటే చెయ్యమన్నాననీ చెప్పి తరువాత వాళ్ళబ్బాయిచేత మూడు కాపీలు టైప్ చేయించి పెట్టమను. ఈ కాగితం మాత్రం ఆ మేష్టారి దగ్గరే వదిలేసి, టైపు చేస్తారు చూడు ఆమూడు కాయితాలూ తీసుకొని, రేపు తలుపులుతో బాటు కాలేజీకి రా. మీటింగ్‌లో మంత్రిగారికి అందరూ వినతి పత్రాలని కాయితాలిస్తుంటారు చూడు అప్పుడు మీరిద్దరూ కలిసి స్టేజిమీదకెళ్ళి దణ్ణంపెట్టి మంత్రిగారికో కాయితం, గరికయ్య. సర్పంచ్‌లకి మిగతావి ఇచ్చెయ్యండి. పోలీసులూ ఇంకా ఎవరైనా మిమ్మల్ని అటకాయించి ఏమిటా కాయితాలన్నా మీరేంచెప్పక్కర్లేదు.

ఈ కాయితంలో వ్రాసిందంతా నీ మేనల్లుడు తలుపుల్ని పిలిచి. నేను చెప్పేను. వాడొప్పుకున్నాడు. మరి నువ్వు స్వీపర్ పోస్టులో ఉంటూ గుడిసె కావాలంటే ఒప్పుకోరు. అంచేత తలుపులే తాను నైట్‌వాచరు కాబట్టి ఇల్లు కావాలని. వాలీబాల్ కోర్టు కటువారగా గోడకానుకొని గుడిసె కట్టుకోడానికి ఆర్డర్‌ద్వారా అనుమతించమని మంత్రిగారిని ప్రార్థిస్తున్నట్టుగా ఈ కాయితం వ్రాసేను. అలా ఆర్డరంటూ వచ్చేక నువ్వే ఇల్లు కట్టుకొని వుంటావు— ఏమంటావు." అన్నారు.

"సానా బాగున్నాదండీ తలుపులు నాయింట్లోనే యెదిగినాడు కదేటండీ ఆడికి నానంటే సానా ఆపేచ్చున్నాది లెండి"— అంది అంకాలు కాగితా న్నందుకుంటూ.

"మరివెళ్ళు ఆపనులన్నీ చక్కబెట్టుకో పనయ్యేవరకు మాపేర్లు బయటకి రానీయకు" అన్న వెంకటామయ్య మాట కడ్డొస్తూ—

"అదేటి బాబూ - నాకు తెల్దేటండీ - నాను నచ్చి మీ కడుపున పుడుతా నండి - యెల్తాను" అని నమస్కారం చేసి అంకాలు వెళ్ళింది.

మర్నాడు హోమీ బాబా ద్వారం వద్ద ఎదురు చూస్తున్నజనం దూరంగా మంత్రిగారి కారు చూడ్డంతో చటుక్కున రోడ్డు కటూఇటూ తప్పుకొన్నారు.



మంత్రి కారు దిగేరు— యే వొక్కరు తనదగ్గిరకి రావడంగాని, కనీసం నమస్కరించడం గాని చేయకపోవడంతో వో క్షణం ఇబ్బందిలో పడ్డారు.

ఇంతట్లోనే "స్టార్ట్" అని వినిపించడం, ద్వారం స్తంభాల వెనకనుంచీ ఘటాలున వచ్చిన ఆడపిల్లలు రెండులైన్లలో ఫిజికల్ ఇన్‌స్ట్రక్టర్ అంటున్న "వన్ టూ - త్రీ ఫోర్ - ఫైవ్ సిక్స్ - సెవెన్ యైట్; యైట్ సెవెన్—సిక్స్ ఫైవ్ - ఫోర్ త్రీ - టూ వన్" అనే మాటలకి లయబద్ధంగా యూనిఫారమ్‌లో వున్న తాము అటూఇటూ వొంగి లెజిమ్స్ కొడుతూ చరచర మంత్రికెదురుగా వచ్చారు. వాళ్ళ మధ్యగా కిరీటంతో రాణీవేషంలోనున్న అమ్మాయి మినిష్టర్ గారి దగ్గరికి వచ్చి, యువరాణీ లందించిన వెండిపళ్ళెంతో వారికి హారతిచ్చి పూలమాల వేసింది. యువరాణులూ, రాణీ పళ్ళాల్లోంచి వయ్యారంగా తీసి పూల రేకుల్ని నేలపై జల్లుతూండగా మధ్యగా మంత్రిగారు మెల్లగా అడుగులు వేస్తూ వస్తున్నారు. అటూ ఇటూ లెజిమ్స్ కొడుతూ వెనుతిరిగి పిల్లలు చరచర వస్తున్నారు.

ఎంత నిగర్వికైనా ఇలాంటి తంతు జరుగుతుంటే కొంచెం బుర్ర ఎగ రేస్తూ మరీ నడవాలనిపించి తీరుతుంది!

ఈ వింత స్వాగతానికి మంత్రిగారు గొప్పగా ప్లీజై చిరునవ్వుతో ముందుకు సాగివస్తున్నారు - ముకుళిత హస్తాలతో అందరి నమస్కారాలని అందుకొంటూ, ఫ్లాష్ కెమెరాలు తెగ మెరుస్తున్నాయి.

కాలేజి దగ్గరున్న రామన్ ద్వారం దగ్గర కొందరు బ్రాహ్మణులు చేతులతో పూర్ణకలశాలని పట్టుకొని—"ఓం స్వస్తిర్మానుషేభ్యః" అని మంత్రాలు చదువుతూ ఎదురొచ్చి కలశోదకాన్ని మంత్రిగారిపై సన్నగా మామిడాకులతో ప్రోక్షిస్తూ, పునాదుల దాకా తీసుకువెళ్ళి అక్కడ షామియానా క్రింద వో చిత్రాసనంపై మంత్రిగారిని కూర్చోబెట్టి, సంకల్పం చేయిస్తున్నారు.

కుర్చీ వరసలలో మధ్యగా కూర్చొన్న వెంకటామయ్యగారి భుజంపై వెనకనుంచి మెత్తగా తట్టి తనవైపు తిరగ్గానే కళ్ళతో "బయటికి పోదాం" అని భాస్కరాచారి సంజ్ఞ చేసేరు.

ఇవతలి కొచ్చేక "అలా వెళ్దాం రండి"అని ముందుకు నడుస్తూ, స్టూడెంట్ తెచ్చిన సిగరెట్ పేకెట్టు అందుకొని థాంక్స్‌చెప్పి, హైస్కూలు వెనకాతలకి వెంకట్రామయ్యని తీసుకుని భాస్కరాచారిగారు వెళ్ళేరు.

రాసుసిరి చెట్టుకొమ్మ నానుకు సిగరెట్ వెలిగించి వెంకట్రామయ్యగారికి సిగరెట్ అందిస్తూ భాస్కరాచారిగారు మొదలుపెట్టేరు—

"అవునండీ - ఎందుకండి ఆ రాతలు?! ఆకాయితంపై సదరు మంత్రి వరేణ్యుడు ఏ ఏక్షన్ తీసుకొన్నా తీసుకోకపోయినా - మన ప్రెసిడెంట్ సర్పంచ్‌లు మాత్రం మిమ్మల్ని భరతం పట్టిస్తేగాని వో పట్టాన వొదలరు తెలుసా!"

"బాగుంది - వాళ్ళెవరో భరతం పట్టిస్తారేమోనని భయపడి ఈ అన్యాయాన్ని అందునా పాపం దాని కొంప పీకేసి, చాపా ముంతా వీధిని గిరాటేస్తే చూస్తూ కూర్చోడం ఏం ధర్మం చెప్పండి" అన్నాడు వెంకట్రామయ్య బిగించిన పిడికిట్లోంచి పఫ్ లాగబోతూ.

"ఐ మీన్ - నా అభిప్రాయం అదికాదు ఇలా కాయితాల్తో మీరనుకొన్నది ఏం సాధిస్తారని! వూరకే బైటపడిపోయి - వాళ్ళ చిర్రు బుర్రు కోపాలకి మీరు గురవడం తప్ప మరేం కాదు. అయినా ఈ సర్పంచ్ తనకు లొంగని అంకాలికి ఈ వీలు దక్కనిస్తాడనా మీ నమ్మకం!"

"నేను అంకాలు వ్రాసుకొన్నట్లుగా కాయితాన్ని రాయలేదే! తలుపులే ఇల్లు కావాలంటాను. ఆ ఇంట్లో అంకాలుంటుంది."

"వూరుకోండి మేష్టారూ - మీరు మరీను! ఈ పొలిటికల్ బ్రైన్స్‌కి మీ ఆలోచనలు అర్థం కావనుకొన్నారా? అంతెందుకు? అంకాలిని ఇంట్లోంచి తగిలేసినప్పుడే అది ఎవరెవరి దగ్గరికి సలహాకి పోతుందో కూడా వాళ్ళకి తెలుసునంటే మీరు నమ్మగలరా!"

"అయితే - దాని ఖర్మాన దాన్ని వొదిలేయడమేనా వీళ్ళకి భయపడి!

"ఏం వొదలక్కరలేదు — హాయిగా వో వారందాకా — అంటే మన



కాలేజీలో పరీక్షలు స్టార్టయేవరకూ కూతురింట్లో వుండి, తరువాత గప్‌చిప్‌గా మునపటివోటే వో పాక లేపి; హాయిగా ఈ కొంగ్రొత్త చంద్రశిలాఫలక స్థగిత కుడ్యాన్ని తనింటికి వో ప్రక్కగోడగా మలచుకొని మరీ సుఖంగా వుంటుంది!"

"అదేవిటి? అక్కడ లేబరేటరీ — అదేలెండి — మొత్తంమీద ఏదో వొకటి కట్టేయబోతున్నారుగా!"

"కట్టేయబోతుంటే అంటారేవిటండీ? కట్టేస్తేను! ఆ చంద్రశిలాఫలకం వున్న దిమ్మ కట్టేసేరా లేదా?! అంతే - దట్సాల్!"

దూరంగా చప్పట్లూ, మైక్‌లోంచి ప్రిన్సిపాల్ చదివే స్వాగత పత్రమూ వినిపిస్తున్నాయి.

"అంతే మేష్టారూ - మరేం లేదు! అనవసరంగా మీరే మాత్రం వర్రీ అవకండి! వారం రోజుల్లో పరీక్షలొస్తున్నాయి. ఆపైన సెలవులు కదా! అంకాలు లేపబోయే గుడిసెపై ఎవరైనా దృష్టి త్రిప్పటానికే మూణ్ణెల్ల పైచిలుకు పడుతుంది. ప్రిన్సిపాల్‌కి ఇలాంటి విషయాల్లో చీమకూడా కుట్టదన్న సంగతి మీకు వేరే చెప్పక్కరలేదు. అది మళ్ళా గుడిసె లేపేసరికే మన ముష్కరుడి ప్రాణాలు పైకి పోతాయి - అలాంటిది దానితో మాట్లాడ్డమే! ఇక ఒకవేళ సర్పంచ్ దృష్టిపడినా - ఇప్పుడు తాను దగ్గరుండి ప్రోత్సహించేకదా అప్పుడు "ఎందుకొచ్చేవ్ మళ్ళా" అని అనడానికి! పైగా మీహస్తానకూ ఝడిసి వూరుకొంటాడు. ప్రెసిడెంట్‌కి మనం ఏవేవో వాడి గుట్లు చెప్పేస్తామని మనమంటే వూరకే తెగ బెరుకు. ఇక వొకవేళ అందరూ ఏకమై పాక పీకేస్తామన్నా — మనం వున్నాం - వూర్లో వాళ్ళు కొందరున్నారు 'ఏది మీరన్న భవన నిర్మాణానికని వొక్కటంటే వొక్క బండెడు రాళ్ళు, వొక్క బండితో సున్నమూ తెచ్చి అక్కడ పోయించండి!— మేమే దానిపాక పీకేసి, పీకపై చెయ్యేసి మరీ బైటికి గెంటేస్తాం''అని చెప్పడానికి!—ఏవంటారు?

అసలింతకీ అంకాలిని అప్పుడు ఈ సర్పంచూ, ఈ ప్రెసిడెంటూ పైకి అనకపోయినా లోపల ఎంతమెచ్చుకుంటారో వూహించండి?!— ఎందుకంటె— వాళ్ళకి అవసరం వొచ్చినప్పుడు మారుమాటాడకుండా గుడిసె తీసుకుపోయింది తరువాత గుడిసె వేసుకొని ఇప్పటి చంద్ర శిలాక్షరాలు ఆకర్మసాక్షి కూడా

కన్పించకుండా చేసి వాళ్ళ మర్యాద కాపాడుతుంది కదా! పైగా "ఏస్తే యేసుకు కున్నాపుగానీ— వో సూరు కూడా అతట్టున దించేసుకు యేడవరాదటె.— ఆ సెందర సిలావలకం కంపినీటుగా అవుపించకుండా - పోద్ది! ఆపైన నిదానంగా నీ పొయ్యి పుణ్యమా అనీ ఆ ఫలకానికింత మందాన పొగట్టుకుపోయి మాకింత పరువు దక్కుస్తాది గందా!"— అవి తప్పకుండా అంకాలితో అని తీరతారు చూడండి!-

ఏమిటలా నిర్ఘాంతపోయి చూస్తున్నారు - పదండి పోదాం - మరో సిగరెట్ తీసుకోండి''— అంటూ భాస్కరాచారి తనో సిగరెట్ వెలిగించుకొని సంగోరు మూసిన తన దోసిట్లో వేలిగే అగ్గిపుల్లతో వెంకట్రామయ్యగారి సిగరెట్నికూడా పదిలంగా నిదానంగా ముట్టించేరు!

—'భారతి'. 1979 సెప్టెంబరు.





# ఆల్పనా

కొబ్బరి మొవ్వల్లో పడిన వెన్నెల ఆకుల సునుపుల మీంచీ జారి దిగూతున్న పచ్చగడ్డిపై పడి తుళ్ళుతోంది. వెన్నెల నీడలలతో మేం కూర్చున్న జాగా అంతా మోడరన్ డిజైన్ వేసిన మొజాయిక్ ఫ్లోరింగ్‌లావుంది. అరిటాకుల ఊగిసలాటతో మావైపు తిరగబోయిన గాలి సంపెంగ గుబురులో ఇరుక్కుని; విరజాజి పొదమీదా మల్లెమొక్కమీదా తూలీ సోలీ మరీ మమ్మల్ని తాకుతోంది. దూరంగా ఇంటి పెరటిగోడ వారనున్న కూరగాయల మళ్ళలో నీటి వంకాయల మీది నిగారింపులో వెన్నెల వింతగా మెరుస్తోంది. పెరటికి మధ్యనున్న సాల పైకప్పు వెన్నెట్లో కిరీటంలా వుంది.

ఆర్నెళ్ళ క్రితం నేనో చిన్న ఆర్ట్ ఎగ్జిబిషన్ని వూర్లో పెట్టేను. అప్పుడు ఈ లక్ష్మీరావుతో పరిచయం ఏర్పడింది ఆ పరిచయం పెరిగి పెరిగి ఈమధ్య సావాసంగా మారింది. ఫలితంగా సాయంత్రం నుంచీ ఏ అర్ధరాత్రి వరకో మేమిలా కూర్చుని ఏవేవో విషయాలు చర్చించుకొనేదాకా వచ్చింది. ఆవాళ మాత్రం అలా మౌనంగా ఆకుల నీడల్లో కుర్చీలు వేసుకొని వెన్నెల పచ్చికపై కాళ్ళు జాపుకు కూర్చున్నాం.

ఉన్నట్టుండి లక్ష్మీరావు—"మీరేం చెప్పండి. నాకు ఈ మొక్కల్ని పెంచుకుంటూ, ఆ సాలలో చదువుకొంటూ; వీలైనప్పుడల్లా — మీరంటారు చూడండి పికాసో ఆర్ట్ అని!— అలాంటి ఈ వెన్నెట్లో ఆరుబయట కూర్చొని మీరు చెప్పే విషయాల్ని వింటూంటే వున్న ఆనందం మరెక్కడా ససేమిరా నాకు లేదూ రాదూ!"— అని అంటూ రెండు సిగరెట్లనితీసి నానోట్లోనూ తన నోట్లోనూ పెట్టి వెలిగించి "అసలు ఇంతకు మించిన ఆనందం ఎక్కడో వుందని తిరిగెత్తడం పొరబాటేమో ననుకుంటాను... ....మా ఆవిడా పిల్లలతో వాళ్ళ మాట తీసేయలేక ఎక్కడెక్కడికో తిరిగేను. తిరుపతి యాత్ర మొహం మొత్తింది! పోనీ నాగార్జునసాగర్ శిధిలాలన్నా కదిలించేయా అంటే అదీలేదు!

* డా॥ ఎస్ ఎ ఎస్. ఎన్. వర్మగారిచే హిందీలోకి అనువదించబడినది, వారికి నా ధన్యవాదములు.



# ఆ ల్ప నా

కొబ్బరి మొవ్వల్లో పడిన వెన్నెల ఆకుల నునుపుల మీంచీ జారి దిగూతున్న పచ్చగడ్డిపై పడి తుళ్ళుతోంది. వెన్నెల నీడలలతో మేం కూర్చున్న జాగా అంతా మోడరన్ డిజైన్ వేసిన మొజాయిక్ ఫ్లోరింగ్‌లావుంది. అరిటాకుల వూగిసలాటతో మావైపు తిరగబోయిన గాలి సంపెంగ గుబురులో ఇరుక్కుని; విరజాజి పొదమీదా మల్లెమొక్కమీదా తూలీ సోలీ మరీ మమ్మల్ని తాకుతోంది. దూరంగా ఇంటి పెరటిగోడ వారనున్న కూరగాయల మళ్ళలో నీటి వంకాయల మీది నిగారింపులో వెన్నెల వింతగా మెరుస్తోంది. పెరటికి మధ్యనున్న సాల పైకప్పు వెన్నెట్లో కిరీటంలా వుంది.

ఆర్నెళ్ళ క్రితం నేనో చిన్న ఆర్ట్ ఎగ్జిబిషన్‌ని వూర్లో పెట్టేను. అప్పుడు ఈ లక్ష్మీరావుతో పరిచయం ఏర్పడింది ఆ పరిచయం పెరిగి పెరిగి ఈమధ్య సావాసంగా మారింది. ఫలితంగా సాయంత్రం నుంచీ ఏ అర్ధరాత్రి వరకో మేమిలా కూర్చుని ఏవేవో విషయాలు చర్చించుకొనేదాకా వచ్చింది. ఆవాళ మాత్రం అలా మౌనంగా ఆకుల నీడల్లో కుర్చీలు వేసుకొని వెన్నెల పచ్చికపై కాళ్ళు జాపుకు కూర్చున్నాం.

ఉన్నట్టుండి లక్ష్మీరావు—"మీరేం చెప్పండి. నాకు ఈ మొక్కల్ని పెంచుకుంటూ, ఆ సాలలో చదువుకొంటూ; వీలైనప్పుడల్లా – మీరంటారు చూడండి పికాసో ఆర్ట్ అని!— అలాంటి ఈ వెన్నెట్లో ఆరుబయట కూర్చొని మీరు చెప్పే విషయాల్ని వింటూంటే వున్న ఆనందం మరెక్కడా ససేమిరా నాకు లేదూ రాదూ!"— అని అంటూ రెండు సిగరెట్లనితీసి నానోట్లోనూ తన నోట్లోనూ పెట్టి వెలిగించి "అసలు ఇంతకు మించిన ఆనందం ఎక్కడో వుందని పరిగెత్తడం పొరబాటేమో ననుకుంటాను... ....మా ఆవిడా పిల్లలతో వాళ్ళ మాట తీసేయలేక ఎక్కడెక్కడికో తిరిగేను. తిరుపతి యాత్ర మొహం మొత్తింది! పోనీ నాగార్జునసాగర్ శిధిలాలన్నా కదిలించేయా అంటే అదీలేదు!

---

శ్రీ డా॥ ఎస్ ఎ ఎస్. ఎన్. వర్మగారిచే హిందీలోకి అనువదించబడినది, వారికి నా ధన్యవాదములు.

బొర్రగుహ కొంచెం కదిలించినా సంతృప్తిలేదు........అదిగో ఆ పాపికొండల మధ్యనుంచి బోటుమీద రావడం మాత్రం కొంచెం థ్రిల్లింగ్‌గా ఉందనుకోండి........నేను రానులెద్దురూ మీరు వెళ్ళిరండి"— అన్నారు.

ఇంతట్లోనే ట్రేలో కాఫీ సరంజామా అంతా పట్టుకుని ఇంట్లోంచి వొస్తున్న అతని భార్య "ఈ పాదులూ మొక్కలూ చెట్లూ చేవాం యెక్కడికీ పోవుగాని హాయిగా మేష్టారితో వెళ్ళిరండి. నాతో మీ టేస్టులు సరిపడవని యెక్కడికీరారు— అలా అని నేను బాధపడాలేదు మేష్టారితోనన్నా వెళ్ళిరండి. మళ్ళా మీకింత మంచి కంపెనీ దొరకదు" అంది ట్రేని మామధ్య పెట్టి తానూ కూర్చుంటూ.

ఆవిడ అలా ట్రేతో డికాషనూ గట్రా తెచ్చి పెట్టేస్తుందంతే! ఆవిడ సరిగ్గా సరైన పాళ్ళలో కాఫీ కలపలేదని లక్ష్మీరావు భావన. అంచేత కాఫీతానే కలుపుతుంటారు.

అలవాటుగా లక్ష్మీరావు కాఫీ కలపబోయేటంతలో తక్కున నేను ఆ సరంజామా దగ్గరికి లాక్కొని "ఆగండి. ఇవాళ - మీ టేస్ట్‌కి సరిపడేలా కాఫీ కలపగలననే నా నమ్మకం రైటో కాదో వొక్కసారి ట్రై చేస్తాను''అన్నాను— మూడు కప్పుల్లోనూ మూడు రకాల మోతాదుల్లో కాఫీని కలుపుతూ.

కాఫీని సిప్ చేస్తూ "థేంక్స్—ఏది షేక్‌హేండ్!—బ్రహ్మాండంగా వుందనుకోండి''అన్నాడు లక్ష్మీరావు ''అబ్బ—ఇన్నేళ్ళకి మావారి టేస్ట్‌కి సరిపడ్డ కాఫీ చేసే వ్యక్తి నొకర్ని చూసేను. ఇన్నేళ్ళలో నేను కనిపెట్టలేని అభిరుచిని ఇన్ని నెలల్లో మీరెలా కనిపెట్టేరో—వింతగా వుంది" అందాతని అర్థాంగి ఖాళీ కప్పుని ట్రేలో పెడుతూ.

"బాగుంది—కాళిదాసంటాడు లెండి 'పురుషులకు భార్యమీద కన్నా స్నేహితునిపైనే చెదరని ప్రేమాభిమానాలుంటాయి' అని! అలావారేదో పూరికే మీకన్నా నన్నే అభిమానంగా చూస్తూ అంటే అదంతా నమ్మేస్తారేవిటి?!........ఇంతకీ రేపు నేను నేరుగా స్టేషన్‌కి పోవాలో; మీయింటిమీంచి వెళ్ళాలో తేలలేదు''అన్నాను.

"కానీండి - యిలాగే రండి" అన్నారు లక్ష్మీరావు.



"చూసేరా— మావారి టేస్ట్ తెలుసుకోడం వారిని సేటిస్‌ఫై చేయడం ఏం మాటలతో పనికాదు. అది కేవలం మీకే చేతనైందని యిప్పుడే తేలిపోయింది........ఈ రాత్రంతా వారి బేగ్ సర్దడంతోనే నాకు తెల్లారిపోతుంది. ఇంతకీ మీ టూర్ యెన్నాళ్ళు "అందావిడ మహాహడావిడిగా ఖాళీ కప్పులు సర్దుతూ.

"శాంతి నికేతన్‌లో మా కాన్ఫరెన్స్ సరిగ్గా నాలుగురోజులు. ఆపైన కలకత్తా చుట్టి రావడానికి మరో మూడురోజులు. ఇక రానూ పోనూ కలుపుకొని వెరసి పదిరోజుల్లో మీ శ్రీవారిని చిరునవ్వుల పువ్వుల్తో సహా మీకు అప్పజెప్తాను" అన్నాను లేస్తూ.



లలితకళల వల్ల వొచ్చే అలౌకికానందం యెదుటివారితో బాటు మనం పంచుకొన్నప్పుడే కలుగుతుంది కాబోలు! అలాకాకపోతే కళాస్రష్టలంతా తమ మనః కుహరాల్లోంచీ విరజిమ్ముకొచ్చే చిత్రవిచిత్ర భావనలకి రూపకల్పన చేయకుండా తమకు తామే ఆ ఆనంద సరస్సులో వోలలాడుతూ వుండాల్సి వొచ్చేదేమో! కళాసృష్టిలోనేకాక కళాస్వాదనలో కూడా యింతేనేమొ! మనం మెచ్చిన కవితనూ, మన మనసుకు నచ్చిన సుందర దృశ్యాన్ని యెదుటివారి మనసుతోనూ, కళ్ళతోనూకూడా మనం చూడగలిగితేనే గాని అచ్చమైన అలౌకిక దివ్యానందం రాదేమో?!

మానవునిలోవున్న ఈ సహజాతం వల్లనే మనిషి తన మానసిక స్థాయితో సమానంగా తులతూగే మరో వ్యక్తికోసం పరితపిస్తుంటాడు. ఇలా సహృదయుని కోసం చేసే అన్వేషణలో వొకొక్క అదృష్టవంతుడికి వొకొక్క సహృదయుడు అప్పటికప్పుడు అరనిముషంలో తారసపడవచ్చు ఒక్కోవ్యక్తికి జీవితమంతా వేసారినా దొరకకపోవచ్చు. అనుక్షణం అతి సన్నిహితంగావున్న వ్యక్తికూడా మానసికంగా అమితదూరంలో వుండవచ్చు అయితే ఆ దూరాన్ని రూపుమాపి తనకు సహృదయునిగా తీర్చిదిద్దుకోవాలని అనుక్షణం ఇవతలి వ్యక్తి ఆరాటపడుతూనే వుంటాడు. ఆ ఆరాటం ఫలించనూవొచ్చు — ఫలించకపోనూవొచ్చు!

ఇలాగే ఘనేసేవేసారిపోతున్నాను. లక్ష్మీరావుని యిందుకే వెంటబెట్టు కొచ్చేను. అయితే అతణ్ణి అతని సుందర పరిసరాల్నించి వేరుచేసి అయిదు రోజులయే సరికల్లా-"ఆర్నెళ్ళ సావాసంతో ఇతణ్ణి నా సహృదయుణ్ణిగా యెంచుకుని యిలా తీసుకురావడంలో పొరపాటుచేసేనా?!'— అని నాకు అనుమానం వేసింది.

ఎంచేతంటే - ఈ దేశం మొత్తం నుంచీ విదేశాలనుంచీ కాన్ఫరెన్స్‌కి "యత్ర విశ్వం భవత్యేకనేదం" అన్నట్లు వచ్చి; ఎన్నెన్నో ఆసక్తికర విషయాల్లో పేపర్స్ సబ్మిట్ చేసిన మేధావుల సాహచర్యంగాని, వాళ్ళ ప్రసంగాలుగాని లక్ష్మీరావుని వొక్క పిసరుకూడా కదల్చలేక పోయాయి.

ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్ కారణమేమో అనుకొని నేను పనిగట్టుకొని అతనిలో అతనికే తెలీకుండా నిద్రాణితమైవున్న విలువల్ని అతనికి పట్టి చూపిస్తూ "ధైర్యంగా మాతో కలిసిపొండి"—అన్నాను.

—ఫలితం! మా కాన్ఫరెన్స్ నాలుగురోజులూ శాంతినికేతన్ నుంచి బస్సుదొరికినా దొరక్కపోయినా బోల్పూర్ పోయి అక్కడి సత్యజిత్‌రాయ్ చలనచిత్ర వారోత్సవాల్లో రంచన్‌గా పాల్గొనేవాడు!- అదన్నా ఈ మా నరకాన్ని తప్పించుకోడానికే!

జాతీయస్థాయిలో ఎన్నెన్నో కంపెనీలు ఏర్పాటుచేసిన బ్రహ్మాండమైన బుక్ ఎగ్జిబిషన్ కూడా అతన్ని కదిలించలేకపోయేసరికి........నా అనుమానం మరింత గట్టిపడింది.

రవీంద్రుడు స్వయంగా నృత్యనాటికగా రూపొందించిన "చండాలిక"ను అక్కడి ప్రోగ్రామ్స్ అన్నింటికీ హైలైట్‌గా యెంచుకొని, మేమంతా పులకిత శరీరాల్తో చూస్తుంటే ఇతను దాన్ని సాదా ప్రోగ్రాంలాగా చూసేడు!

శ్రీమతి బసంతలతా బెనర్జీ చేస్తున్న కూచిపూడి నృత్యాన్ని నేనలా ఆ రెండువేల పైచిలుకు దేశీయ, విదేశీయ ప్రేక్షకుల మధ్య ప్రాణా లుగ్గబెట్టి నాట్ ఘర్‌లో చూస్తూ; మధ్యలో వూపిరిపీల్చుకొంటూ ప్రక్కన చూద్దును కదా....?! ప్రోగ్రాం ముగిసేక అతని కోసం తెగ గాలించగా ఆమ్రోకుంజోలో కామినీ నికుంజాలనీడలో పచ్చికపై పడుకొని తీరిగ్గా ఫఫ్ లాగుతున్నాడు!



"యెలా రాగలిగే రండీ?!— ఆవిడ పుట్టుకతో బ్రిటన్ పిల్లైనా చిన్నప్పటినుంచీ యిక్కడే చదువుకొని నృత్యంలో డాక్టరేట్ పుచ్చుకొందట! హిందూమతాన్ని కూడా పుచ్చుకొని ప్రస్తుతం ఢిల్లీలో డీన్‌గా వుందట!—పోనీ అదంతా అలా వుంచుదాం ఆమె భారతీయ నృత్యాలన్నింట్లోనూ నిష్ణాతురాలు. అయినా ఆమెకి కేవలం మన కూచిపూడి నృత్యం మాత్రమే నచ్చడం; అంత తెలుగుతనాన్ని మాటలో యేస లేకుండా సంపాదించుకోడం; ఈ ఇంతటి విలువైన ప్రేక్షకుల మధ్య మన తెలుగు ఆటా మన తెలుగు పాటా ప్రదర్శితం కావడం........మీకు నచ్చలేదా?!"అన్నాను అతణ్ణి చేరుకుంటూ.

"పోనిద్దురూ........చూడండి యివేం పూలోగాని ఎలా వొత్తుగా రేకుల్ని అలా రాలుస్తూ పరిమళిస్తున్నాయో! ఈ వెన్నెల్లో ఇలా ఈ శాటిన్‌లాన్‌పై ఆ తెల్లని పూలరేకులు వొత్తుగా రాలడం; ఆ పూలచెట్టు నల్లని ఆకులపై తెల్లని వెన్నెల మిలమిల లాడడం; దూరంగా ఆ అద్దాల ప్రార్థనా మందిరం అందాలూ........ఈ దృశ్యంతో సరిబుచ్చుకొంటాను లెద్దురూ" అన్నారు సిగరెట్టు పెట్టీ అగ్గిపెట్టీ నాకందిస్తూ.

"సరిబుచ్చుకోడం యేమిటండీ— ఈ సోనార్ బంగ్లాలో అడుగు పెట్టించి మీకు జీవితంలో అననుభూతాలైన అనుభూతుల్నీ, అలౌకిక దివ్యానందాల్నీ అందించాలని పనికట్టుకు నేను తీసుకొస్తేను"- అని సిగరెట్ వెలిగించి "ఈ పూల మొక్కని తెలుగులో పూవెలగ అంటారు వీళ్ళు కామిని అంటారు" అని అంటూ నేనూ చతికలబడి మొదలు పెట్టేను—

"మనదీ అంటూ యేపాటి ప్రయత్నమూ లేకపోతే ఈ లోకంలో ఏ ఆనందాన్ని మనం అనుభవించలేమేమో! కోణార్క శిల్పాలైనా డార్జిలింగ్ సొగసులైనా ఫర్వీన్ సుల్తానా పాటైనా ఇప్పటి ఈ నృత్యమైనా — మీఅంతట మీరు కొంచెమైనా మీ దృష్టిని మరల్చకపోతే - మిమ్మల్ని ఆకట్టుకోలేవు. అలౌకికానందాన్ని అనుభవించడానికి కొంత కృషి వుండాలి కొత్తలో బలవంతంగానైనా సరే మన దృష్టిని వాటిపై పెట్టాలి. కొద్దిగా వచ్చే విసుపును అణుచుకొంటూ "ఏమిటుంది ఇందులో" అనే దృష్టితో ఒక్కసారి పట్టిచూస్తే— అది మనకు వాటివలన అలౌకికానందమే దక్కుతుంది. అలా దక్కించుకున్నప్పుడే జీవితానికి సార్థకత అని నా భావన"

"మన ప్రయత్నమన్నది లేకుండా మన మనస్సును పట్టేసి ఊపేసేదే కళ కాని''........అన్నారు చేత్తో పూలరేకుల్ని తీసి జారుస్తూ!

"నేను దాన్ని పూర్తిగా కాదనడం లేదు కాని; కనీసం మనం వాటిని కన్నెత్తి చూడాలి – చెవులొగ్గి వినాలి – పేజీత్రిప్పి చూడాలికదా! ఆపాటి పని కూడా నేను చేయను అని కాళ్ళుజాపుకు కూర్చునేవాడికి అలౌకికానందం ఎలా దక్కుతుంది అనే నా ఆరాటం!........పదండి చాలా రాత్రయింది'' అంటూ అతనితో బాటు లేచేను.

ఈ నా మాటలు అతనిపై ఏమాత్రం పనిచేసాయా అని అలా అతన్ని పరిశీలిస్తూనే ఉన్నాను కాని; అతడు చేసే పనల్లా – నన్ననుసరించి హౌరాబ్రిడ్జి వార నిల్చోడం; మార్బుల్ పేలస్‌లో మొహమాటానికని అలా వోసారి తలెత్తి చూస్తూ తచ్చాడడం; విక్టోరియా మెమోరియల్ మెట్లపై కాళ్ళు ముడుచుకు కూర్చోని వో పెట్టెడు సిగరెట్స్ని తగలెట్టుటడం; ఇండియన్ మ్యూజియంలో "ఎందుకొచ్చిందిరా భగవంతుడా?!" అన్నట్లు చకచక వో రెండు చక్కర్లుకొట్టి గుమ్మం దగ్గర నే వచ్చేదాకా నిల్చోడం మినహాగా ఏమీ లేదు.

–నేననుకున్నట్లు అతని సాహచర్యం వల్ల నేను ఆనంద తీరాలని చేరడంమాట దేవుడెరుగు! నాతో తిరగడం ఇతనికి నరకంలా ఉన్నట్టుంది! ఇతన్నెందుకిలా తీసుకొచ్చాను. అసలితన్ని నాకు సహృదయునిగ యెంచుకోవడంలో ఇలా ఎందుకు పొరబాటైందని?! ఇంత తప్పుడుగ ఎలా అంచనా వేశాను! .... వాళ్ళింట్లో రాత్రులకు రాత్రులు నేచెప్పే విషయాల్ని విని రసాస్వాదనతో నిజంగా మైమరచి పోయేవాడే! అలాంటిది ఈ కాన్ఫరెన్స్ ఉపన్యాసాల్లో ఏ ఒక్కదానిమీదా ఇతడు బుద్ధి పెట్టలేదు!...భావుకత లేకపోతే వాళ్ళింట్లో నన్నలా నిగ్గదీసి మరీ అర్టునిగూర్చి ఎలా అడగ గలిగే వాడు?! ఆ కామినీ నికుంజాలలో ఆ ఆనందాన్ని వెతుక్కుంటూ ఎలా వెళ్ళగలరు! అంతెందుకు భావుకతే లేకపోతే నాతో ఈ ఆర్నెల్ల సావాసమే లేకపోయేదికదా పైగా ఇంట్లో తనకు తానుగా ఏకాంతంగా కల్పించుకొన్న ఆ సుందర వాతావరణాన్నిగాని నాతో ఏకాంతంగా గడిపే తీరునుగాని చూచిన వారెవరైనా అతడు భావుకుడు కాడు అని అనగలరా?!.



–ఇలా ఆలోచిస్తూ అలా ఆ బొటానికల్ గార్డెన్స్‌లో ఎంతసేపు నడిచేనో నాకే తెలియకపోవడం వింత కాదుగాని; నన్ననుసరించి అడుగులో అడుగువేస్తూ వస్తున్న అతగాడికి కూడా తెలీకపోవడం వింత!

గేటికి అవతల వో ముష్టివాడు కూర్చొని బౌల్ వాయిస్తూ పదం అందుకున్నాడు. రాగం సుళ్ళుతిరుగుతూ వేయిఊడల మర్రిచెట్టును దాటుకొని సూటు రేకుల పద్మాల మడుగుపై నుంచి గుభాళిస్తూ వచ్చి మరీ మాకు వినిపిస్తోంది.

"కెమొనె దొర్బెతారె
ఓమోన్, మొనెర్ మానుష్ బోలిష్‌యారె!
సేయ్‌రే ధరామొయ్
హాయ్‌రే ధారణా నాయాయ్!

* * * * *

ఆధార్‌కె ధోర్తె పారే
సేయ్ అంతరే బాహిరే బిరాజ్ కరే!
నాజలె అనలె అనిలె హాయ్‌రే
నాహీ మిలే పూరబె అకాల్‌పాథారే!"

మా బాట ప్రక్కన దిగువగా హుగ్లీ యెండలో మిలమిల మెరిసిపోతూ ప్రవహిస్తోంది - అవి యెగిసిపడే చేపల వొంటి నిగనిగలా లేక మిలమిలలాడే అలల మెరుపులా?!-

మెరుపులా వో సంగతి మెరియడంతో తక్కున వాచీ చూసుకొని; లక్ష్మీరావు చేతిని పట్టుకు గబగబా బయటకు వచ్చి; ముష్టివాడి బోలెలో ఓ రూపాయి పడేసి; చకచక వెళ్ళి బేలూరు వెళ్ళే బస్సులో యెక్కి కూర్చున్నాను.

"ఆ వాయిద్యాన్ని బౌల్ అంటారు తెలుగులో బోలె; బోలు అంటాము కదా అదేయిది. "బోలెడన్ని డబ్బులు" ఈ వాయిద్యంవల్ల ఏర్పడ్డ పద బంధమే! ఆ పాట బ్రహ్మాండంగా వుందనుకోండి- "పరమాత్మ అని నువ్వు పేరు పెట్టుకొన్న ఆ బ్రహ్మ పదార్థాన్ని నువ్వెలా అందుకోగలవు? ప్రపంచమంతా అదే నిండిఉన్నా మనం దాన్ని పట్టుకోలేం! నీ ఏకాంత విహారాలలో అదే విరాజిల్లుతూ కనిపిస్తుంటుంది! నీళ్ళలో నిప్పులలో గాలిలో

అది లేదా?! తూర్పు అగాధ సముద్రాలలోనూ లేదా?! "అని ఆ పాటకర్థం! పూ - దిగండి బస్సు" అన్నాను లక్ష్మీరావుతో

టైము అయిదవుతూంది. బేలూర్ మఠ్‌ని గేటుదగ్గర నుంచే చూపెట్టేసి; అతని చేతిని పట్టుకు గబగబ పక్కసందుల్లోంచి లాక్కు తీసుకుపోతూంటే "ఎక్కడికి"అని నోరు తెరిచి అడిగేరు

"ఇన్నాళ్ళూ నన్నెప్పుడూ ఇలా అడక్కుండానే నన్నుసరించే మీరు ఇప్పుడిలా అడిగేరేవిఁటి?!........అలౌకిక దివ్యానందాన్ని మీ కందించడానికి!"

"మీరీమాట ప్రతీసారీ అంటున్నదేలెద్దురూ!- ఎక్కడికేవిఁటి'' అన్నారు చేతిని తీసేసుకొని నాతోబాటు చకచక నడుస్తూ

"దక్షిణేశ్వర్‌కి"

"ఏం నన్నమాంతం సన్యాసుల్లో కలిపేస్తారేవిఁటి''

"దిగబోతూ లోతడగడం ఎందుకు - జాగ్రత్తగా దిగండి" అన్నాను హుగ్లీలోకి మెట్లమీంచి దిగుతూ

నాల్గురూపాయల ఖర్చుతో వో పావుగంటలో దక్షిణేశ్వరికి చేర్చే లాంచీ రెడీగా వున్నా వదిలేసి; ప్రక్కనున్న పడవవాళ్ళను వోసారి పరిశీలనగా చూసి వొకడ్ని పిలిచి పడవయెక్కి టైముచూసుకొన్నాను, అయిదుంబావయింది "అమ్మయ్య" అనుకొని; రుమాలుతో చవఁట తుడుచుకుఁటున్న లక్ష్మీరావుని గూడుమీద కూర్చోమన్నాను.

పడవని గెడకర్రతో ప్రవాహంలోకి నెట్టి! చివరి అడ్డుబద్దీపై కాళ్ళు తన్నిపెట్టి కూర్చొని పడవవాడు రెండు చేతులతోనూ తెడ్లు వేస్తున్నాడు.

గంగాలహరిలో మాపడవ సాఫుగా నీటిపై జారుతున్నట్లు ముందుకు సాగిపోతోంది.

నేను బేగ్‌లోంచి పదిలంగా వో స్వీట్ పొట్లాన్నితీసి విప్పి లక్ష్మీరావుకి రెండందించి పడవ నేస్తానికి రెండందించేను. వాటిని చూసి పడవవాడు పడిన ఆనందం అంతాయింతాకాదు............''సర్బోజా; షక్కారియా?!" — అని అరిచేడు ఆనందంగా!



"వాకొకా! యే మాధుర్ సర్భోజా తుమాఁరే మాధుర్ గీతో జున్నే"అని పడవ నేస్తానితో అని లక్ష్మీరావుతో "మధురాతి మధురం ప్రస్తుతం మీ ముందుంది! ఈరెండు పిండివంటలు బెంగాలీ జానపదుల సొత్తు. పేర్లు విన్నారుగా! శాంతి నికేతన్‌లోనే కొని సరైన సమయం రాలేదని ఇప్పటిదాకా తీయలేదు - తీసుకోండి" అన్నాను నేనూ తీసుకు కూర్చుంటూ

పడవవాడు అప్పటికే తినేసి నీళ్ళుత్రాగి; వో సీసాతో నీళ్ళని మా కందేలా పదిలంగా పెట్టి - తిరిగి తెడ్లు వేస్తూ అందుకొన్నాడు.

"అమార్ గంగాజీలో
తూమార్ రంగే భోలో........"

లక్ష్మీరావు ఒక్కసారి చలించి నోట్లో ముక్క నోట్లో ఉంటూండగానే చటుక్కున అటు తిరిగి అలా శూన్యదృక్కులలో చూస్తూ వుండిపోయేడు!

రాగ ప్రవాహం సుళ్ళు తిరుగుతూ పరవళ్ళు త్రొక్కుతూ సాగిపోతూంటే సాహిత్యం మెఱిసిపోతూ మనసుపై యథార్థంగా ప్రతిఫలిస్తోంది—

'ఓ గంగాజలమా! నీ రంగుల తరంగాల్ని తెరు!
దిగ్భ్రమ చెందించే రంగుల్తో ఇంకాఇంకా
ఆకాశాన్ని నిండి పోనివ్వు!
ఈ చీకటిని ఇంకా యింకా పేరుకు పోనివ్వు!
ఏం నాకేం భయమా?!
తీరాలను ముంచేత్తే ఈ చీకటి యెంతసేపుంటుంది.
అసలు నేనెందుకు భయపడాలి?!—
ఈ చీకట్లను చీల్చేగానం - నాగొంతులో వుంది!
నీ నీళ్ళను చీల్చే తెడ్డు - నాచేతిలోవుంది!'— చాలాకాలం క్రితం

సచిన్‌దేవ్ బర్మన్ గంగపై పాడిన పాట గుర్తుకు వస్తోంది — ఈ జానపద గీతాన్నే అతడు స్వీకరించేడో లేక అతనిపాటే ఇలా ప్రచారాన్ని పొందిందో!

పాటా పాటతోబాటు పడవా పోటీగా ముందుకు దూసుకుపోతూంటే కాలం లాగా వేగంగా గంగ వెనక్కిపోతోంది!

ఐదున్నర దాటింది.

పుట్టిలా వున్న సూర్యుడు గగనగంగలో తేలుకొనిపోతూ వేగంగా ఆవేగంగా పడమటి తీరాలవైపుకు కొట్టుకుపోతున్నట్లున్నాడు! పుట్టి కదలికల వల్ల కదిలిన అలలలాగా మేఘాలు క్షణక్షణానికీ రూపాల్ని మారుస్తున్నాయి. గుంపులు గుంపులుగా పక్షులు కలకలమని కూసుకుంటూ బొటానికల్ గార్డెన్స్ వైపు పరుగులు తీస్తున్నాయి.

పరమహంస మనస్సులాగ గంభీరంగా సాగే గంగ!

ఈవైపు బేలూర్ మఠమూ ఆవైపు పీర్స్ కంపెనీ బిల్డింగూ కను మరుగైపోయాయి. అంత వేగంవల్ల కాబోలు చెఱువులో వెళ్తున్నట్టేవుంది! నీళ్ళలో తన నీడని చూసుకుంటూ పడవ వయ్యారంగా సాగిపోతోంది. క్రమ క్రమంగా వివేకానంద బ్రిడ్జి మాకు చేరువౌతోంది. పాట చివరిరాగం గుండెల్ని కుని పేస్తూ గాలిలో విలీనమైపోయింది.

"జీవితంలో యిప్పటిదాకా రుచిచూడని మాధుర్యాన్ని మీరిద్దరూ ఇవాళ నాకు రుచి చూపించేరు - మీకు నాధన్యవాదాలు"—అని లక్ష్మీరావు తేరుకొని మిగిలిన స్వీట్ ని తింటూ అన్నాడు.

"ఇదేంపాటి మాధుర్యం?! ఈ మాధుర్యాలు రెండూ కేవలం మానవ కల్పితాలు. వీటి మాధురీ గరిమకే మీరు ఉక్కిరిబిక్కిరైపోతే.......... ఇక ఆ అలౌకిక దివ్యానందాన్ని ఎలా ఆస్వాదించగలుగుతారో అలా అటు చూడండి! గంగా తలంపై వంగ వనిత చిత్రిస్తున్న ఆ అల్పనాను కళ్ళారా అటు అలా చూడండి"—అన్నాను చాపిన నా చేతి చూపుడువేలుతో గంగా తలాన్ని చూపిస్తూ.

అంతే—నిశ్శబ్దంగా నిశ్చలంగా మా పంచప్రాణాల్ని కంటిచూపుల్లో ఉగ్గబెట్టుకు మరీ మేం చూస్తున్నాం - క్రమక్రమ రమణీయ పరిణామాల్ని!

ఒడ్డున వున్న చెట్ల గుబురుల్లోంచీ దూసుకు వొచ్చిన సాయంసంధ్యా సూర్యకిరణాలు గంగా తరంగాలపై సాగిపడి వక్రీభవిస్తూ వందలకొద్దీ కత్తుల్ని పదేపదే ఝుళిపిస్తున్నట్టుంది. తళుక్కు తళుక్కుమనే పొడుగాటి కాంతి కిరణాల కరవాలాల వొంపులు అలలపై అల్లల్లాడుతున్నాయి!



క్రమక్రమంగా నిడివి తగ్గిన సూర్యకరవాలాల కాంతి గంగాతరంగాలపై చిట్లిపోతూ కోటానుకోట్ల ముత్యపుచిప్పలు నీళ్ళపై తేలుతున్నట్లుంది! సూర్యుడి కాంతినంతటినీ తెల్లని యూకా పూలరేకుల్లాగా, కామినీ పుష్పపత్రాల్లాగా చిదిమేసి; ఇంకా మిగిలివున్న వెలుగు రజనుతోబాటు కలగా పులగంగా గంగా ప్రవాహంలో ఒలకబోసినట్లుంది.

కలకత్తా కాళిక సింధూర శరీర రక్తిమ పూజా కుంకుమపరాగంతో విలీనమైపోయి రోదసిలోకంటా ఎగసుకుపోతున్నట్లుగా పడమటి దిక్కున సంధ్యారాగం అలుముకుంటోంది. ఆ రాగరక్తిమ అంతా వినిర్మల గంగానీరంపై ప్రతిఫలిస్తూ రాగరంజితం చేస్తోంది.

మార్బుల్ పేలస్‌లో - మల్టీకలర్డ్ శాండిలీర్స్‌లోంచీ విశ్లేషించుకుపోతూ వచ్చిన కాంతి కిరణాలు క్రింది మొజాయిక్ ఫ్లోరింగ్ మీంచీ పరావర్తనాన్ని వెండి గోడలమీది అద్దాల్లో ప్రతిఫలిస్తూంటే చూస్తున్నట్లుగా వుంది — ఆరాగ రంజిత గంగా తరంగిణి!

న్యూక్లియస్ చుట్టూ ఎలక్ట్రానులు పరిభ్రమిస్తుంటే ఆ పరమాణులీలని పరికిస్తున్నప్పటి పరమానందమూ; వెన్నెట్లో మెరిసే రావి ఆకుల్ని చూసినప్పటి హాయీ నాలో కలిసేయి - ఆ నీళ్ళని చూస్తుంటే!

కాంతి శకలాలన్నీ కలర్ ఫోటియోస్ లాగా వొక్కసారిగా తడితగిలీ తగలడంతో ఆ గంగా తరంగాలలో కరిగిపోయి రకరకాల రంగులుగా మారిపోతున్నాయా?! నీళ్ళలో ప్రతిఫలించిన ప్రైమరీకలర్స్ అన్నీ క్రమక్రమంగా కాంప్లిమెంటరీ కలర్స్ క్రింద మారిపోతున్నాయి. ఆ పరిణామంతో టెక్స్చర్‌పై కన్పించే హార్మొనీగానీ, కలర్ స్కేల్‌గానీ - ఏ చేయి తిరిగిన చిత్రకారుడికీ చేతకానంత పతాకస్థాయిలో వున్నాయి.

సెకను సెకనుకీ మారేసి మార్లుగా మారేసి మోస్తర్లుగా మారిపోయే వాగ్లీ మెటిసిపోయే సొట్టలుగా మడతలుగా బొట్లుగా పరుగులు తీస్తోంది.

ఆ తెలినీటిలో ప్రతిఫలించే సాయంసంధ్యా కాంతుల్లో - వానపడిన రోడ్డుపై పెట్రోలు చుక్కలు పడితే కన్పించే నెమలికన్నుల రంగులూ; దీపావళి చిటపటలు రాసిన చేతుల్ని నలుపుకొంటూ చీకట్లో చూస్తే కన్పించే రంగుల

తరంగాలూ; సంపూర్ణ సూర్యగ్రహణ సమయంలో భూగోళంపై తచ్చాడిన అల్ట్రావయొలెట్ కిరణాల వలయాల సయ్యాటలూ - గుర్తుకొచ్చేయి.

ఆ అలల మిల మిలల్ని అలా కళ్ళార్పకుండా నేను చూస్తూనేవున్నాను. కాని; నాకళ్ళు పనిచేయడం లేదేమో! చెవుల్లో - శివకుమార్ శర్మ సంతూర్ పై సాధించిన హంసధ్వని రాగాలాపన నినాదాలు మాత్రం మారుమ్రోగిపోతున్నాయి. వింతగా! నాపై తొలకరి చినుకులు కురిసినప్పటి అనుభూతి నన్ను అలుముకొంది. సాంతంగా! నా గుండెల్లోంచీ కువకువమని కూస్తూ రివ్వురివ్వుమని తెక్కలు సారిస్తూ ఏదో పిట్ట ఎగిరిపోతున్నట్లుగా ఫీలయ్యేను - సంపూర్ణంగా! కళ్ళతో చేసిన సందర్శనంలో ఈ శ్రవణ, స్పర్శానుభూతులేవిటి?! ఏమో! అనుభవిస్తున్న నాకే తెలీని అలౌకిక దివ్యానుభూతి అది.

క్రమక్రమంగా పల్చని చీకట్లు వ్యాపిస్తుంటే చెట్ల గుబుర్ల నీడలు దట్టంగా నీళ్ళపై ప్రతిఫలిస్తున్నాయి. దూరంగా ఆకాశంలోకంటా లేచుకొస్తున్న పొగమబ్బులు - మసీదుల్లోంచీ ఆకాశానికెగుసుకొచ్చిన సాంబ్రాణి పొగల్లా వున్నాయి.

ప్రకృతి అంతా నిర్మలంగా నిశ్చలంగా నిశ్శబ్దంగా వుంది.

వివేకానంద బ్రిడ్జికి దిగూగా మాపడవ క్రాస్ చేస్తోంది.

"ఎవైడ్ కెలెడొస్కోప్ ఆఫ్ థ్రిల్లింగ్ ఇమేజెస్!-ప్చ్-మేష్టారూ!— ఈ అలౌకిక దివ్యవిశ్వరూప సౌందర్యమంతా లిప్తలో కనుమఱుగైపోయిందేవిటండీ?!— ఈ చిద్విలాసమంతా ఇలా ఏటి పాలవవలసిందేనా! ఈ సాటిలేని సొగసులన్నీ నీటిపై వ్రాతలేనా! ఈ భువనైక మోహన కాంతి పుంజమంతా ఇంత బుద్బుదప్రాయమా?!

ఈ ఆనందంలోని క్షణికత్వాన్ని నేను భరించలేను మేష్టారూ - వొద్దు- ఈ కళ్ళతో ఇంక ఈ పాడులోకాన్ని ఎంత మాత్రం చూడలేను........రండి మేష్టారూ రండి వొక్కసారి వుఱికేద్దాం - రండి. ఈ అనంతానంద సౌందర్య నీరాల్లో మనం కూడా కణాలుగా మారిపోదాం! ఈ పావన నదీ గర్భంలో మనం విలీనమైపోదాం - రండి."



నేను ఠక్కున అతణ్ణి వొడిసి పట్టుకొని "లక్ష్మీరావుగారూ—ఏవిటిది?! పిచ్చెక్కిందా!- ఊరుకోండి! ముందు పడవ దిగండి మీకే చెప్తుంది. గట్లు త్రెంచుకొనే ఆనందాన్ని పగ్గంవేసి నిగ్రహించుకో గలగాలి. అంతేకాని యిదేవిటి! దిగండి మెల్లిగా" అన్నాను గట్టుపైకి దింపి. ఎక్సైటీ వల్లా తనమాట చెల్లకపోడం వల్లా అంత వ్యక్తికీ వొక్కసారి ఏడుపు కట్టలు త్రెంచుకు వొచ్చేసింది. నన్ను విదిలించుకొని ఆసోపానాలమీదే నీళ్ళలో చతికిలబడిపోయి వెక్కి వెక్కి యేడుస్తున్నారు - ఎలుగెత్తి మరీ!—తల్లి రొమ్ము నుంచి బలవంతంగా లాగేసిన పసిపిల్లాడి యేడుపు నాకా యేడుపులో విన్పించింది.

దగ్గరగా వెళ్ళి భుజాలు పట్టుకొని "లెండి - వూరుకోండి. నామాట వినరూ. కొంచెం తట్టుకోవాలి మరి. ఈ అనంత ప్రకృతి చిద్విలాసాన్ని కళ్ళారాచూసి మైమరచేలా మానసికైక్యాన్ని పొందాలేగాని; తాదాత్మ్యంతో శారీరకైక్యాన్ని కోరుకుంటే ఎలా?! ఊరుకోండి మరి. ఈ ఆనందం మీరను కొన్నంత దుర్లభమేం కాదు. ఓ పచ్చనోటు మనది కాదనుకొంటే ఎప్పుడుపడితే అప్పుడు విజయనగరం నుంచి వచ్చి చూచి పోవచ్చు మళ్ళా మీకెప్పుడు రావాలనిపిస్తే అప్పుడొద్దాం - లెండి మొహం కడగనీండి" అంటూ మొహంపై నీళ్ళని చిలికించేను.

"వుండండి మేష్టారూ నన్నెందుకిలా ఆ బ్రహ్మానందం నుండి వేరుచేసి బ్రతికిస్తున్నారు. నిజంగా నేను ఈ గంగలో కలిసిపోవాలి.......మీరోసారి చెప్పేరు - విశ్వరూపాన్ని సందర్శించిన ధృతరాష్ట్రుడు తిరిగి వెంటనే కృష్ణణ్ణి తనకు అంధత్వాన్నే అర్థించేడని!—ప్చ్! ఎంత అర్థం ఇమిడివుందా మాటల్లో! ఇప్పటికిగాని నాకా అభ్యర్థనలోని బాధ అర్థంకాలేదు"— "సరే కాని మీరు అతడిని కూడా మించిపోయి ప్రాణాలే గంగపాలు చేస్తానంటున్నారు కదా!—" అని నవ్వుతూ అతనితోబాటు పొడిమెట్టు మీద కూర్చుంటూ "లెండి మరి— ఏది వో సిగరెట్టన్నా ధన్యవాదంగా నాకు దానం చేయండి" అన్నాను.

"ఇంతటి ఆనందాన్ని జీవితంలో ఈక్షణందాకా ఎప్పుడూ పొందలేదు. నాకింతటి అలౌకిక దివ్యానందాన్ని అందించిన మీకు నాధన్యవాదాలు ఎలా చెప్పను - ఏది వొక్కమారు" అంటూ చటుక్కున నా కాళ్ళపైపడి నమస్కరించబోతూంటే అతన్ని గబుక్కున ఆపి— "మీ కివాళ నిజంగా పిచ్చెక్కింది

లెండి! మీరు నాకాళ్ళు పట్టుకోడవేఁవిఁటి పెద్దవారు. పైగా సాటిమనిషి కాళ్ళను పట్టుకోవడాన్ని నేను అంగీకరించను" అన్నాను.—"మరేంచేసేది?! మీపై నా మనసులో గూడుకట్టుకొన్న ప్రగాఢ భక్తిభావాన్ని తెలుపుడి చేయాలంటే నాకి ఆచారకాండే శరణ్యమైంది!—ఇంతేకాదు! చూడండి"అంటూ గబగబా గంగలో దిగి నీళ్ళను చేత్తో నెత్తిమీద జల్లేసికొంటూ, నామీద జల్లేస్తూ. దోసిళ్ళతో త్రాగేస్తూ "ఈఆచార కార్యాలతోనే ఈ గంగపై నాకున్న అనిర్వచనీయ భావాన్ని వ్యక్తం చేయాల్సివొచ్చింది" అన్నారు. అంతలోనే అటు తిరిగి—

"అరె! నిన్నింత సేపూ మరిచిపోయేనఁరా!"అంటూ గబగబ పడవవాడి దగ్గరకి వెళ్ళి గట్టిగా వాడిని కౌగిలించేసుకు ముద్దు పెట్టుకుఁటూ "వొరె—నా సంతృప్తిని నీకు చెప్పడానికి నాకు భాషేరాదురా" అఁటూ జేబులోంచి వో మూడు పదిరూపాయల నోట్లు తీసి వాడి చేతిలో పెట్టేరు. వాడు మరింత ఆశ్చర్యపోతూ ఎంతవద్దన్నా వినక మా ఇద్దరి కాళ్ళకీ మ్రొక్కిమరీ వెళ్ళేడు.

లక్ష్మీరావు సిగరెట్లు తీస్తూ "ఏవిఁటి పడవెక్కిఁది మొదలు సిగరెట్టు కాల్చలేదేవిఁటి నేను?! ఈ లోకాన్నీ నన్నూ నా అలవాట్లనీ చివరికి వూపిరి పీల్చుకోడాన్ని కూడా మరిచిపోయినట్టున్నాను - ఇఁతగా నన్ను స్వాధీనం చేసుకున్న ఆ ఎక్స్టసీలో అంత అశాశ్వతత్వం యేవిఁటి మేష్టారూ"అన్నారు;

''మీకూ నాకూ ఆస్వాదించడం మాత్రవేఁ చేతనవునుగాబట్టి ఆ అలౌకిక దివ్య సౌందర్యాన్ని కళ్ళారా మనసారా గ్రహించి వూరుకున్నాంకాని; రేపు యూనివర్సిటీ ఆర్ట్స్ గ్యాలరీలో చూపిస్తాను చూద్దురుగాని— ఈ క్షణికా నందానికి యెంతటి శాశ్వతత్వాన్ని ఆయా చిత్రకారులు కల్పించేరో! రవీంద్రుడు మొదలు విలియం డేనియల్ దాకా ఎంతోమంది ఈ ప్రేరణతోనే యెన్నో లేండ్స్కేప్స్ చిత్రించేరు. అవనీంద్రనాథ ఠాగూర్ చిత్రించిన 'డిస్టెంట్ వ్యూ'; 'డాన్ అండ్ ది బర్డ్'లని చూస్తే ఇప్పుడు మనం పొందిన భావతీవ్రతనీ ఎక్స్టసీని తిరిగి అనుభవించగలం"

"ఏమో - నాకేం నమ్మకం లేదు. దానికేంగాని యిందాకా ఏదో ఆల్పనా అన్నారేవిఁటి?!"— "ఆల్పనా అఁటే - జానపద వంగవనితలు రకరకాల రంగుల్ని రంగరిఁచుకొని వాకిళ్ళలో పవిత్రంగా చిత్రించే రంగవల్లికల కళ!"

—మందాకిని 1995

# సీతమ్మ ధార

కైపెక్కిపోయిన సూర్యుడు తన కరాలతో ప్రకృతికాంత బట్టల్ని బలాత్కారంగా వూడదీసి పారేసి ఎరుపెక్కిన ముఖంతో ఆమెను చూస్తున్నాడా— అన్నట్టు నీరెండలో తెల్లని మంచుతెరలన్నీ జారిపోగా ప్రకృతి సౌందర్యమంతా వొక్కమాటుగా బట్టబయలైంది!

వూడదీసి పారేసిన తెల్లచీర గాలికి పొడుగ్గా మెలికలు తిరిగి ఎగురుతూ పైనుంచి దిగూకి పడిపోయిందా— అన్నట్లుంది కొండమీది సన్నని కాలిబాట!

"ఇప్పుడంటే ఇలా మనమిద్దరమే ఇక్కడ రాజ్యం చేస్తున్నాంగానీ— కార్తీకమాసం రావాలి—ఇక చూసుకో ఈ కొండమీద చెట్లూ రాళ్ళూకూడా కనిపించనంతగా జనం పిక్నిక్లకని వొచ్చేస్తారు" అంటూ కొండనెక్కుతున్న వాడినల్లా ఒక్కసారి ఆగి వెనక్కి దిగూగా చూసేను.

తెల్లని మంచుపొరల్లా పాయలు పాయలుగా పాదాలపైకి జీరాడే చీర కుచ్చెళ్ళని కాళ్ళకడ్డు పడకుండా ఎర్రని చేతిమునివేళ్ళతో సుతారంగా ఎత్తిపట్టుకొని ఆయాసంతో నోటితోనే గాలిపీల్చేస్తూ కొండ ఎక్కుతోంది- తను.

"అబ్బ—ఇంక ఎక్కలేనుబాబూ! ఇక్కడే చదునుగా నీడగా బాగుంది ఆగిపోదాం లెద్దురూ'' అంటూ బుజాలకున్న కెమెరా ఫ్లాస్కూ తీసి ఓ వారగా పెట్టి రుమాలుతో సుతిమెత్తగా నుదుటిపై వొత్తుకుంటూ కొంచెం ముందుకివెళ్ళి వో రాతిబండ మీద చేతులాన్చి దిగూకి వొంగిచూస్తూ "అబ్బ! బుర్ర [illegible]క్కించే ఆనగరానికి దూరంగా యెంత పైకొచ్చేసేమో!''అంది.

నేనూ చేత్తోపట్టుకున్న ప్లాస్టిక్ సజ్జను దిగూనవుంచి భుజానికున్న టేప్ [illegible]ర్ను పదిలంగా క్రింద పెట్టి తనకు దగ్గరగా బండపై టవలు పరిచి కెమెరా [illegible]కొని కూర్చున్నాను.

"సీతమ్మధారంటే ఏదో దబదబ పెద్ద జలపాతం వుంటుందనుకొన్నాను [illegible]గా స్నానం చెయ్యొచ్చునని మరో చీరకూడా తెచ్చుకున్నాను తీరావొచ్చి [illegible] మావూరి పొలాల్లో బోరింగుపాటి కూడాలేదు! పైగా అబ్బబ్బ ఆయాసం [illegible]సింది కొండ యెక్కలేక!'' అంది నావైపు తిరిగి సజ్జలోంచి బైనాక్యులర్ [illegible]